## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ASTAGE DRAMA

# కురుక్షేత్రము

[అను సంపూర్ణ మహాభారతం]

ఆఱంకముల వీరరస నాటకం


గ్రంథకర్త :

శతావధాని—బాలకవి

శ్రీ సంపన్మూడుంబ సింగరాచార్యులు



ప్రకాశకులు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్

సంస్కృతాంధ్ర బుక్‌డిపో [స్థా 1882] రాజమండ్రి.





1960

Price Rs 2 00

# నటనా సమ్మేళనము



## పురుషులు

ధర్మరాజు
అర్జునుడు
భీముడు
నకులుడు
సహదేవుడు
శ్రీకృష్ణుడు
శిశుపాలుడు
విదురుడు
వికర్ణుడు
భీష్ముడు
కృపుడు

ద్రోణుడు
అశ్వత్థామ
దుర్యోధనుడు
దుశ్శాసనుడు
కర్ణుడు
నందుడు
శీతారాముడు
నగరవాసి
శివుడు
ఇంద్రుడు

## స్త్రీలు

ద్రౌపది
రుక్మిణి

సత్యభామ
గంగ

మఱికొందఱు వచ్చెదరు.

# కురుక్షేత్రము

## (అను సంపూర్ణ మహాభారతం)

## ప్రథమాంకము

నాంది

శా॥ ఏ నామంబు వికుంఠనామలగరీ ♦ శృంగారసౌధాంతరా
ళానూనస్థిత కీరరాజ మధుర ♦ వ్యాహార నీహారమో,
యే నామం బఘమున్హరించి సకలా ♦ భీష్టంబులం గూర్చునో,
శ్రీనిత్యం బల రామనామము జగత్ ♦ క్షేమంకరం బయ్యెడున్॥

( నాంద్యంతమున )

సూత్ర : (ప్రవే) (తెరవంక జూచి) నటీ! నీవొకమా రిటురమ్ము.

నటి : (ప్రవే) ఆర్యపుత్రా! ఆజ్ఞయేమి ?

సూత్ర : నేఁడు మహాజనులు సభ నలంకరించిరి. కావున,

గీ॥ పాపతూలంబునకు మహా ♦ వాయువెద్ది ?
సంతతానందసుఖమున నొ ♦ సంగునెద్ది ?
సకల పుణ్యంబులను గూర్పఁ ♦ జాలునెద్ది ?
యమ్మహాభారతం బాడ ♦ నగునుజెలియ॥

నటి : అందలి భాషయెద్దియో ?

సూత్ర : అయిన వినుము.

గీ॥ లలితమాధురీసాధురీ ♦ తులను భాష
యార్యమిశ్రుల చిత్తము ♦ అందుఁజొచ్చు
మేలుమేలనఁ దీయని ♦ పాలలోనఁ
గండచక్కెర గలిసెడు ♦ కరణి నబల

నటి : కవి సమర్థుఁడేకదా ?

సూత్ర : వేఱుగా నడగవలయునా ?

సీ. కాపురమా ? కవి ♦ కాంతులపాలిటి
కనకంపుమూట జ ♦ గ్గయ్యపేట
జీవనమా ? సుప్ర ♦ సిద్ధ పండితజన
ప్రతిభావిశేష గీ ♦ ర్వాణభాష
ఆచార్యుఁడా ? విద్వ ♦ దాశుకవిత్వ సిం
హాసనహేళి కృ ♦ ష్ణార్యమౌళి
కులదైవమా ? సర్వ ♦ ఫలముల నొసంగి సం
రక్షించు ప్రభుఁడు శ్రీ ♦ రామవిభుడు

గీ॥ చేసినట్టి గ్రంథంబులా ♦ క్షితిని సకల
సుకవులున్మెచ్చు ముప్పదిం ♦ టికిని హెచ్చు
ప్రజ్ఞయా ? యేకఘంటాక ♦ వనము బిరుద
మా, వరేణ్య ! బాలకవి శ ♦ తావధాని

నటి : ఓహో ! సంపన్ముదుంబ సింగరాచార్యులా ? అయినఁ గొఱఁత యేమి ?

సూత్ర : ఏమియునులేదు. మనము శ్రీకృష్ణపరమాత్మను నమ్మియున్న వారము గాన మన యీ సంకల్పిత కర్తవ్యమునం దెట్టికొఱతలు గల్గిన నతడే నివారించి కొనసాగించు నింకరమ్ము.

(ఇర్వురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన

రంగము : యజ్ఞశాల (తర్వాతఁ బంచపాండవులు, శ్రీకృష్ణుఁడు భీష్మాది సభికులు శిశుపాలుఁడును ప్రవేశింతురు)

శిశు : మీ రజ్ఞానులును, మూఢులును, అసమర్థులును.

ధర్మ : చేదిభూపాలా ! శాంతింపుము, శాంతింపుము.

శిశు : ఎట్లు శాంతింతును ?

గీ॥ కులము, మానము, విద్యయు ♦ గుణము గల్గి
యెందఱెందఱొ భూమీంద్రు ♦ లిందువెలయ
నందఱ కవజ్ఞ గాఁగ దా ♦ శార్హ్ణున కిపు
డగ్రతాంబూలమిచ్చుట ♦ న్యాయమగునె.

: ప్రతి మనుజుని నేత్రములును రత్నములనే పరీక్షింపవు. మేము చేయుపని జ్ఞానులకుగాని సమంజసమని తోఁపదు.

: సరే ! నే నజ్ఞానినే. కాని యొక్కదాని కుత్తరమిమ్ము. ఇతఁ డేదేశపు రాజు ?

: ఒక్కదేశమున కేమి ? మూఁడులోకములకును.

: అది కేవల మసత్యము. వెఱ్ఱిగొల్లలకు మాత్రము.

: రాజనుమాట సామాన్యము. వాచగోచరమగు పరబ్రహ్మము.

: ప్రాజ్ఞులట్లు చెప్పరు. కేవలము మూఢులట్లు మోసపోవుదురు.

: కాదుకాదు. వేదశాస్త్రములే చెప్పుచున్నవి.

: తప్పుతప్పు. వేదశాస్త్రములుచెప్పు పరబ్రహ్మము నిరాకారము, వీడు సాకారుఁడు. ఈశ్వరుఁడజుఁడు, వీనికి జన్మమేర్పడినది భగవానుఁడు నిరీహుఁడు. వీఁడు వ్యభిచారి. పరమాత్మ నిర్భయుఁడు, వీఁడు జరాసంధునకు భయపడినవాడు. ఆపరంధాముడు సర్వవ్యాపి, వీఁడిక్కడనే యున్నవాఁడు ఆచిన్మయుండు——

: ఆహా ! శిశుపాలా ! యెట్టి మూఢవాదమును జేయుచుంటివి !

సీ. కాళియోరగరణా ♦ గణమహొద్దండ నృ
త్యంబు మనుష్య సా ♦ ధారణంబె ?
భారవిస్తార గో ♦ వర్ధనపర్వతో
ద్ధరణంబు మనుజసా ♦ ధారణంబె ?
అఖిలాండకోటి బ్ర ♦ హ్మాండ సందర్శనో
త్సవము మనుష్య సా ♦ ధారణంబె ?
గురుమూత్ర గోగోప ♦ గోపికాసృష్టి సం
దర్భంబు మనుజ సా ♦ ధారణంబె ?

గీ॥ స్వర్గలోక సమానీత ♦ పారిజాత
భూరుహంబు మనుష్య సా ♦ ధారణంబె?
యిప్పటికినైనఁ జెడక శ్రీ ♦ కృష్ణు మొదటి
వేల్పులుఁగానెంచి కొలచి జీ ♦ వింపుమయ్య.

శిశు : ఇవి యన్నియు నమాయకుల మోసపుచ్చుటకుఁ గావించిన కేవల డంబములు, ఇంద్రజాలములు, కనుకట్టులు, గారడులు. అహో! మీరెంత మూర్ఖులు!

గీ॥ ముదుసలియు మూఢుఁడైన భీ ♦ ష్మండు పోవు
దారినేబట్టి పోవుచు ♦ న్నారు మీరు
మొదట నొకగొఱ్ఱె నదిదాఁటఁ బిదప నావి
ధంబుననె తక్క గొఱ్ఱెలుం ♦ దాఁటునట్లు

ఒకవేళ సద్గుణసమేతుఁడని పూజింతువేమో? అట్టి దేదియైన నున్నఁ జెప్పుము. వలదు వలదు, నేనే చెప్పెదను నాకర్ణింపుము.

సీ. గొల్లకొంపలదూరి ♦ యల్లరుల్సేయుచు
మీఁగడముద్దల ♦ మ్రింగినాఁడు
మామతన్నుంబట్టి ♦ మర్దించునను భీతిఁ
దరలి నందునియింట ♦ దాఁగినాఁడు
దోషమంబెంచక ♦ దుర్మతి గోహత్య
స్త్రీ హత్యయును గూడఁ ♦ జేసినాఁడు
ప్రేమమైఁబిలచిన ♦ మామసన్నిధికేగి
మించి యవ్వీరు న్వ ♦ ధించినాఁడు

గీ॥ వ్రేవెలందులయిండ్లలో ♦ రేగినాఁడు
న్యాయమునువీడి యెల్లర ♦ నడఁచినాఁడు
చెప్పరాని దుష్కృతులను ♦ జేసినాఁడు
చెనఁటి హీనుని వీనిఁ బూ ♦ జింపదగదు.

కావున మీకొక్క హితోపదేశమును జేసెద వినుఁడు.

గీ॥ పల్లవాధరల గృహంబు ♦ లెల్లఁజొచ్చి
కొల్లగా మీఁగడలమ్రింగు ♦ గొల్లవాని
ప్రల్లదములాడువాని నీ ♦ నల్లవాని
నల్లహరియని చెడిపోకుఁ ♦ డయ్యమీరు.

: ఓచైద్యా ! హేయప్రత్యనీక కళ్యాణగుణగణ విశిష్టుఁడగు శ్రీకృష్ణ భగవానునియందు దుర్గుణము లాలోపించెదవేల ? సుగుణము లెన్నియున్నవో యవి యన్నియు శ్రీకృష్ణునిగా భావింపుము.

: వీనికి గోపికల కడఁ బెరుగు పాలు బిచ్చమెత్తుటయే సుగుణము. కంబళినెత్తి వైచికొని యావులఁగాచుటయే సుగుణము. వీఁడు పండితుఁడా, కాఁడు. ఇట్టి హీనుని, ఇట్టి మూర్ఖుని, ఇట్టి పాపిని, ఇట్టి జడుని, ఇట్టి వెఱ్ఱిగొల్లవానినిఁ బూజించుట కేవల మవివేక మని యెట్టి మూర్ఖునికైనను స్పష్టమగుచుండ నీ బుద్ధి ప్రమాద మొంది, భ్రమసి, యధమాధము నుత్తమోత్తముఁడని చెడి పోయెను. వీని కభిమానములేదు. వీనికిఁగౌరవములేదు. వీనికిఁ బౌరుషములేదు. ఇంతగా సభాస్థలమందు ఱాయిగ్రుద్ది చెప్పు చుండినను చెవులు దోరగించుకొని వినుచుండెనేకాని సిగ్గుపడడు. కోపింపఁడు. ఆహా ! వీఁడెంత డాంబికుఁడో గాని నా మాటలను లెక్కించుచున్నవాఁడు. ఇంత మాత్రముననే వీనికి నేను జడి యుదు ననుకొనియెను గాబోలు ! వీనికి భయపడి చేతులుగట్టు కొని మాంపాహి, మాంపాహి యని శరణాగతుఁడ నగుదునని తలచెను గాఁబోలు ! ఛీ, ఛీ, వీని జన్మముగూడ నొకజన్మమేనా ? వీని పౌరుషముగూడ నొక పౌరుషమేనా ? వీని——

: (త్వరితముగ) ఆ ! ఆ ! సాంతముగ శతదూషణోక్తు లాడవల దూరకొను మూరకొనుము. శ్రీకృష్ణా ! యితనితో నీకేమి ? యిదిగో ! సభాతాంబూలమును గ్రహింపుము.

శ్రీకృ : (తనలో) ఇంక వీనిని బరిమార్చెద.

ఉ. వీను మహా మహీభరము ♦ నెల్లహరింపఁగనెంచి దేవకీ
సూనుఁడనై జనించి, బల ♦ సూదనముఖ్యులు సన్నుతింపఁగా
దానవకోటి నుక్కడఁచు ♦ తామరసాక్షుఁడ నౌదునేని, దు
ర్మానసు నీఖలు న్నఱకు ♦ మా క్షణమాత్రములోనఁ జక్రమా ?

(ప్రకా) నాకక్కఅలేదు. వానికేయిమ్ము. (విసరివేయ నా పళ్లె రమే చక్రమై శిశుపాలుని ద్రుంచును. శ్రీకృష్ణునిపై బుష్పవర్షము గురియును.)

(తెరలో)

క. సనకసనందన శాపం
బునను ర్వి జనించుచైద్య ♦ భూపాలుఁడు శ్రీ
వనరుహనయనానుగ్రహ
మునఁ బరమపదంబు జెందె ♦ మునులునుతింపన్.

ధర్మ : (సంతోషముతో) ఓ శిశుపాలా! మాయందరికన్న నీవే ధన్యుఁడవు! శ్రీకృష్ణ భగవానుని యనుగ్రహమును సంపూర్ణముగాఁ గననోఁచితివి.

శ్రీకృ : సహదేవా! సహదేవా!

సహ : స్వామీ! యేమియాజ్ఞ ?

శ్రీకృ : ఈ శిశుపాలుని రుద్రభూమికిం గొంపోయి చందనకర్పూరాదులచే దహనము గావించవలయు.

సహ : ఈ యవినీతున కీ మహా సంస్కారమేల ?

శ్రీకృ : "మరణాంతాని వైరాణి" యనుట వినలేదా ?

సహ : చిత్తము (పరిక్రమించి) ఆఁ! ఏమనుచున్నారు ? "శ్రీకృష్ణ పరమాత్మ నీ సమయమున దర్శింపవలయు" ననియా ? సరి సరి. (వచ్చి) స్వామీ! మిమ్ము సేవింప రుక్మిణీ సత్యభామా ద్రౌపదులు వచ్చియున్నారు. కావున వారి ననుగ్రహింతువుగాక!

(నిష్క్రమించును)

: మంచిది. (పరిక్ర)

( రుక్మిణీ సత్యభామా ద్రౌపదులు ప్రవేశింతురు )

: అన్నా ! నీవ్రేలునుండి రక్తమెందులకు స్రవించుచున్నది ?

: శిశుపాలుని వధింపఁ జక్రమభిమంత్రించి వేయునప్పుడు నాదృష్టి చెదరినది. దాన నిది తటస్థించెను.

: (వదినెలతో) వదినెలారా ! మీరు త్వరగా నొక వస్త్రమును దెండు. అన్నగారి వ్రేలునకుఁ గట్టుదము.

: (అటునిటుఁజూచి) చిన్నవస్త్ర మేదియులేదే !

: నేను లోనికిఁజని వెదకి తెచ్చెదను.

: ఎక్కడనుండి తెచ్చెదవు ? ఎప్పుడు తెచ్చెదవు ? ఇదిగో ! (తనచీరె జించి కట్టును)

: ఇది క్రొత్తగా నున్నదె ?

: అన్నా ! యీ చీర కోమలమైన నీ శరీరముకన్న ముద్దా ! నీరక్త బిందువు క్రిందఁబడినప్పు డిది యెందులకు ? కొల్వనా ? లక్ష చీరెలును నీరక్తబిందువు మీఁదఁ ద్రిప్పివేయుటను బనికిరావు. చీరెయేగాదు. నీ యాపన్నివారణము కొఱకు నా శిరముమీఁది చర్మమునైన నిచ్చుటకు సంసిద్ధనై యున్నదానను. (అని తల వంచును.)

: (హర్షముతో) చెల్లెలా ద్రౌపదీ ! నీ నిజమైన భక్తియే మౌష ధముకన్న నెక్కుడు పనిఁజేసినది. నిశ్చయముగ నేనీ సమయ మం దీచీరెజూడను. ఈ వ్రేలును జూడను.

: మరియేమి చూచెదవు ?

: నీభక్తి విశ్వాసములను, నా దృష్టి నీ భక్తివిశ్వాసముల మీఁదనే యున్నది. వానినే చూచెద. వానినే చూచితి. వానినే చూచు చున్నాఁడను. నేనెన్ని చీరలిచ్చినను నీ చీరెపోగునకైనఁజాలవు.

: నా ముద్దులన్నా ! నీకేమైన నవసరమున్నచో నీ శరీరమును గూడ ధారవోయనా ?

శ్రీకృ : చెల్లెలా ! వేయిమాటలేల ? నేఁటినుండి నీ చీరకు ఋణపడితిని.

సీ. అమ్మరో యొక్క చం ♦ దమ్మున నెడతెగ
    క స్రవించురక్తము ♦ గట్టైనమ్మ !
మాతరో ! నీభక్తి ♦ చేత దుఃఖాంబుధి
    ముంచినబాధ హ ♦ రించెనమ్మ !
తల్లిరో యాత్మవ ♦ త్సర్వభూతాని యు
    న్పలుకు నిజంబుగ ♦ సల్పితమ్మ !
జననిరో ! నీమేటి ♦ కనకవస్త్రమ్మును
    జించిప్రేమమ్ము వివ ♦ రించితమ్మ !

గీ॥ మోదమొనఁగూర్చు నీ వస్త్ర ♦ మునకు నేఁటి
నుండి ఋణమును గావించి ♦ యున్నవాఁడ
నవసరంబైనయప్పు డో ♦ యమ్మ కోరి
కొనుము నే వడ్డితోఁ దీర్చు ♦ కొందునమ్మ !

ద్రౌప : అన్నా ! నీ దయయున్న మాకేమికొదవ ? ఇఁక మాకానతిమ్ము.

శ్రీకృ : మంచిది పోయిరండు (రు॥ స॥ ద్రౌ॥ నిష్క్రమింతురు) (పాండవుల చెంతకువచ్చి) మీ సంకల్పము నెరవేఱెఁగదా ? ఇంక బంధుమిత్రాదుల నాదరించి యథాస్థానంబులకనుప నాలోచింపుడు.

ధర్మ : మంచిది. దానికై యేకాంతమున నాలోచింతము రండు.

(అందరు నిష్క్రమింతురు)

(౭-వ రంగము : మయసభ-తర్వాత భీమ దుర్యోధన శకునులు ప్రవేశింతురు ద్రౌపది మేడమీదనుండి ప్రవేశించుచుండును)

భీము : ఈ సభ మయునిచే నిర్మింపఁబడినది.

శకు : (అప) కుమారా ! చూడుము. ఇది నీ చిత్తమును గాల్చుటకై యేర్పడిన నిప్పురవ్వయని తెలిసికొంటివా ?

దుర్యో : (అప) మామా ! తెలిసికొంటిని—తెలిసికొంటిని.

: ఈ సభామంటపమ్ము సం ♦ తోషమెల్ల
నీటముంచి చిత్తముగాల్చు ♦ నిప్పదవ్వ
అనిలపుత్రుఁడు చూపుట ♦ ననువధింప
వెదకిదాఁచిపెట్టిన మేటి ♦ విచ్చుకత్తి.

(ప్రకా) బాగు! బాగు! ఈసభ యెంత రమణీయముగ నున్నది!

శ్రేణిగనున్న రత్నముల ♦ చేతనే దీపికలున్న తీరునన్
రాణఘటిల్లె ముత్తెపు స ♦ రంబులచేతనె ముగ్గులొప్పె గం
భీరరవంబుచేతనె స ♦ గర్వనృపస్మయు మీఁగె నిత్యక
ల్యాణము పచ్చతోరణము ♦ నై యిది శాశ్వతకీర్తిన్‌గాంచెడిన్.

: (తనలో) ఇది సభగాదు. పాండురాజు మరణసామగ్రి.

: ఈమార్గ మీవైపుగాఁదిరిగి యాగశాల కేగును.

: (అప) చూచితివా? గర్వముతో నెట్టిమార్గముఁ జూపుచున్న వాఁడో?

: (అప) అవునవును. (ప్రకా) భగవంతునికే తెలియును. వీని పని చాల విస్మయకరముగా నున్నది.

: (తనలో) ఈ వాక్యము హృదయమునుండి రాలేదు. సదభిప్రాయ మును దురభిప్రాయమును దాఁచినను దాఁగవు. కన్నులోర్వలేని తనమును సూచించుచున్నవి.

: ఈ వేదికం జూడుఁడు. ఇది చిన్నదేకాని దీని పనితనము సాటిలేనిది.

(అప) దుర్యోధనుఁడు రాజుగాకపోవుటయే గాక కేవలము మనుష్యుడే కాఁడు. ఇట్టి చిత్రము నెన్నఁడును జూడలేదు. వట్టి యరణ్యమృగమని యితఁడు తలఁచుచున్నవాఁడు.

: (వేదికనుజూచి) ఉదక మెంత నిర్మలముగాఁ బాఱుచున్నది!

: అవును. (అని పాదుకలను విడచును. దుర్యోధనుఁడు వస్త్ర మెత్తి పటుకొనును)

భీము : (నవ్వి) పాదుక లేలవిడిచెదరు ? వస్త్రము లేల సవరించెదరు

దుర్యో : ఈజలమును దాఁటుదము.

భీము : ఇది కాసారముగాదు, నదియుగాదు, సమస్థలము.

దుర్యో : ఇది పనివాని చాతుర్యము.

శకు : నిశ్చయముగాఁ బనివాని చాతుర్యమే !

భీము : అటుచని యదియును దిలకింతము.

దుర్యో : రండు పోదము. (అని నడచి నీటిలో మునుఁగును)

భీ॥ద్రౌ॥ : (పక్కున నవ్వుదురు)

దుర్యో : (తనలో) ఆ ఏమీ ! యెంతగర్వ మెంతగర్వము ! ఇతఁ పరాభిమాన ధనుఁడగు సుయోధనుఁడుగదా ? ఊఁ ! కానీ (అప) మామా ! చూచితివా ?

శకు : (అప) క్షమింపరాని యపరాధము.

భీము : వ్యాకులచిత్తులైన లాభమేమి ? ప్రమాదమునఁ దటస్థించినది రండు నూతనవస్త్రములు ధరింపుఁడు.

దుర్యో : మంచిది. (అని పోవ గోడ తలకుఁ దగులును) ఇది కవాటమ గదా ? భిత్తియా ?

భీము : ఇదిగో నావెంటరండు.

దుర్యో : (కోపముతో) ఇందుండి యెట్లు రావలయును ? ఇది భిత్తిగదా దీనిలోనుండి దూరి రావలయునా యేమి ?

భీము : కవాటము భిత్తిగను, భిత్తిని గవాటముగను భావించుచున్నారు కవాటము తెరవఁబడియున్నది రండు.

దుర్యో : సరే. (అని యందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.

# కురుక్షేత్రము
## (అను సంపూర్ణ మహాభారతం)
## ద్వితీయాంకము

( 1-రంగము : దుర్యోధనుని శయనమందిరము )

(శయనించి విచారముతోనున్నట్లు ప్రవేశించి) ఓ భగవంతుడా! యింక నన్ను నీలోఁ జేర్చుకొనుము. నీవే యింక నాకుఁ బ్రియుఁడవు. లజ్జాభిమాన వర్జితంబగు నిట్టి జీవితంబుకన్న గతించుటయే యుత్తమము.

పొచ్చెములేని కూర్మిని రి • పుల్ చెలరేగి పరాక్రమాఢ్యులై
యుచ్చ్రయరీతి శత్రువుల • నొంచుచు మించుచు సంచరింపఁగా
నెచ్చటనోవసించి యహి • హీయన నీ బ్రతుకేల యక్కటా
చచ్చుటయే నిజంబుగను • సర్వవిధంబుల మేలు దైవమా ?

(అని విషముఁ ద్రాగఁబోవును)

(ధృతరాష్ట్రునితోఁ బ్రవేశించి చేయివిదల్చి) సుయోధనా! సుయోధనా! యూరకుండు మూరకుండు మీ కొలదికే యింత సాహసమా?

నాయనా! నామాటవిని ప్రాణహానిఁ జేసికొనకుము.

ఓహో! తండ్రిగారే వచ్చిరా?

నాయనా సుయోధనా!

తండ్రీ! యిక్కడి కేలవచ్చితివి?

నీ సంగతి విని, నీ వవమానమను వస్తువును విరోధమగు చేతితో నమ్మనుంకించు చున్నాఁడవు.

దుర్యో : అవును తండ్రీ ! నా తండ్రిగారి యపరిమిత ధనంబుఁ జూచు వఱకు నా ముఖకళ మాఱిపోయినది.

ధృత : తండ్రీ ! నీవిటు లనవలదు. నీ కేమితక్కువ ? యుధిష్ఠిరుఁ డితరుఁడు కాఁడు. అతనికి నీకు భేదములేదు. జన్నమునుజూచి సంతోషించుటకు మారుగాఁ జింతింపఁజనునా ?

దుర్యో : తండ్రీ ! నీవేమైనఁ జెప్పుము. ఒకవేళ పాండవుల సంపదఁ జూడఁదలఁచిన నింత చల్లని గుండెతోఁ జూడలేను. ఈ దినమునఁ బాండవులు పదివేలసన్యాసులకు బంగరు పళ్లెరములలో భోజనముఁబెట్టి భుజించుచున్నవారు. పదియారువేల బ్రాహ్మణ కుటుంబముల నే కొఱంతయు, గల్గనీకుండఁ బోషించుచున్నవారు. వారు కట్టించిన దేవాయతనములకు లెక్కలేదు. వారు పెట్టిన సత్రములు కోట్లకు మించియున్నవి. వారి దాసదాసీ జనమున కంత మిదియని యెవ్వఁడును జెప్పఁజాలఁడు. త్రిదివేంద్రసమ విభవానుభవులగు వారి సంపదకు సరియైన సంపదను నేను స్వప్నమునందైనఁ జూడఁగలనా ? నేను వారి ధనమెంత వ్యయ మొనర్చినను నా కంతమే దొరకలేదు. నాయనా ! యిఁక నన్నెట్లూరడిల్లుమందువు ?

ధృత : నాయనా ! యీ మాట దరిద్రుఁ డనవలసినదికాని నీ వనవలసినదియా ? నీకేమి రారాజవు. త్రిలోకాధీశ్వరుండగు మహేంద్రుని నైతము ధిక్కరించు మహావైభవంబుతో రాత్రింబవళ్లు సుఖమనుభవించు చున్నాఁడవు ! ఇది యేమి ప్రారబ్ధము తండ్రీ ! నిద్రాహారంబులును గూడ విసర్జించితివి ? ఇదిగాక మరియొక మాట. నీ వన్నట్లు మన పాండవులవిభవ మసంఖ్యాకమే యగుగాక ! అది యెన్నాళ్లు నిలుచును ? ధన మశాశ్వతము. నిముషములో వచ్చును. నిముషంబులోఁ బోవును, నేఁడు కుబేరులై రేపు దరిద్రదేవతకు నిలయమగు వారిని నిత్య మెందఱెందరిని జూచుచున్నారము ? కావున——

దుర్యో : అయ్యా ! మీరు చెప్పవలసినది చెప్పితిరేకాని నేను మాత్ర మీ యవమానమును సహింపఁజాలను. అక్కటా : పాండవుల విభవ మేమందు ?

గీ॥ నదులుఁ గాల్వలుఁ గుంటలు • హ్రదము లాది
గాఁగలుగు జలదేవత • ల్సాగరమున
నింపుగతి రాజులెల్ల ర • నేక చిత్ర
వస్తువుల నింపుచుండిరి ర • ఖ్యారిగృహము.

ధృత : పాండవుల సంపద పూవులుపూఁచి కాయలుగాఁచి ఫలములయి వర్ధిల్లుఁగాక ?

దుర్యో : కాదు తండ్రీ ! మీరు నన్ను బుజ్జగించుచున్నారు. ఎవరున్నత స్థితికిఁ బ్రయత్నింతురో, వారు తమ కామితార్థ మనుభవింతురు.

ధృత : ఈ మాటలు నీతికి సరియైనవి కావన్ని నీకును తెలియును.

దుర్యో : నాయనా ! యీ కారణ మొక్కటియే యైనయెడల నెట్లో దిగ మ్రింగి యూరకుందును. గాని భీమసేనుని తిరస్కారంబునకును, అంతకంటె ద్రౌపది పరిహాసమునకును నేను నిల్వఁజాల కున్నాఁడను.

ధృత : లేనిపోనివి వృథాగా నీవు తెచ్చుకొనుచున్నాఁడవు. పరిహాసము సమానవయస్కులకుఁగాక యింకెవ్వరికుండును? నీవు మఱఁదియు బావయు నగుటచే ద్రౌపది యట్లు గావించి యుండవచ్చును. దీనికే యింతయా ?

శకు : మహారాజా ! మన మెంతచెప్పినను సుయోధనుని యంతశ్శల్య మూరక వీడునది కాదు. కావున మీ రానతిచ్చినచో మంచి యుపాయముఁ జెప్పెద. ఒక్క నిముషములో యుధిష్ఠిరుని సంపదయంతయు నటునిటు కాఁగలదు. లోకమునకు న్యాయము గనే కన్పించునట్లును, మనకొక వస్తువుకూడఁ బోకుండునట్లును పాండవుల సిరియంతయు మన తనాయాసంభుగ లభించునట్లును

జెప్పెద. శస్త్రాస్త్రములను బ్రియోగించుకొనుటగాదు. ద్వంద్వ యుద్ధంబునకు ఢీకొనుటగాదు. మిత్రులలో మిత్రులకు భేదంబు గల్పించుటగాదు. దేహి దేహియని మంచిమాటలుచెప్పి యాచించుటగాదు. పాము చావవలె బడితె విఱుగఁగూడదు !

ధృత : అట్టి యుపాయమున్నఁ ద్వరగాఁ జెప్పుము.

శకు : మీకుఁ దెలిసియున్నదే.

ధృత : అదేది ?

శకు : ధర్మరాజున కభిరుచి దేనియందుగలదో ?

ధృత : అనఁగా ?

శకు : అంతియేగాక దేనిమర్మంబులు ధర్మజుడు చక్కఁగా నెరుంగడో ?

ధృత : ఇంత యుపోద్ఘాతమేల ? అదియేదియో స్పష్టముగఁ జెప్పరాదా ?

శకు : ఇంకఁ జెప్పెడిదేమి ? ఆవిద్యయందు నే నప్రతిమానుఁడను. నాతో సరిగనాడు వారీకాలంబున నెందు వెదకినను లేరని చెప్పుకొనిన మీరు నమ్మరుగాని—

ధృత : ఆడుటయేమి ?

శకు : ఏమా ? జూదము ?

ధృత : జూదమా ? జూదమా ?

శకు : అట్లు నివ్వెరపడెదరేల ? మహారాజా ! నేను నిశ్చయముగా యుద్ధములోఁ బాండవులను జయింపఁజాలను. కాని జూదములో గజదంతములతోఁ జేయఁబడిన పాచికలతోఁ దప్పకగెల్వఁగలను. అదియే నా ధనుస్సు, అదియే నా వింటిత్రాడు, దానిపై నాకుఁ జాలనమ్మకము. మీరు నమ్ముఁడు. నమ్మకపొండు. ఎక్కడ జూదముండునో యక్కడ నలుమూలలు నా రాజ్యము. ఒక్క పందెము వేయఁగనే యీ నిర్వేదమంతయు మాయమగును. ఒక్క క్షణకాలములోననె వారిసొమ్ము మీసొమ్ము కాఁగలదు.

దుర్యో : అక్కడి సొమ్మిక్కడకు వచ్చుట దురోదరము మూలముననా ?

శకు : అవును, అవును.

ధృత : ఛీ ! ఛీ ! నీచమైన నీ యుపాయమును ధిక్కరించెదను. నీ యుద్దేశ్యము, నీ నీతి, నీ ప్రవర్తనము మంచిదికాదు. దురాచారమైన దురోదరము నాడఁగూడదు. జయాపజయము లొకరి స్వాధీనములుగావు. పోయినఁబోవును, వచ్చినవచ్చును. ధనము ధాన్యము, బలము, సైన్యము, సర్వము నాశము కాఁగలదు. ధైర్యము చెడిపోవును. ధర్మము మాయమగును. మాత్సర్యము విజృంభించును. నీతి నశింపును, జారత్వ చోరత్వాదికంబగు హీనత్వము సంభవించును. జూదము నాశమునకు మూలము. పాపమునకుఁ గారణము.

దుర్యో : (ఉద్వేగముతో) నాయనా ! యీ యుపాయమే పనికిరాని యెడల నేను జీవించి సుఖపడుదునని యాశపెట్టుకొనకుము.

గీ॥ కలనుసైతము నామాట ♦ దలఁపకయ్య
పాండుపుత్త్రకులంగని ♦ బ్రదుకుమయ్య
యిన్ని మాటలతోనేమి ♦ యిదిగొ కత్తి
యిదిగొ ఁబొమ్మిక సుఖముతోఁ ♦ బొదలుమయ్య !

తండ్రీ ! వేయిమాటలేల ?

గీ॥ మాత గాంధారిశోకంబు ♦ మాన్పుమయ్య !
మీగిలినట్టి పుత్త్రకుల క్ష ♦ మింపుమయ్య !
ముఖ్యులైనట్టి ద్రోణ భీ ♦ ష్మలయనుజ్ఞ
చేతనో యెట్టులో కర్మ ♦ జేయుమయ్య !

(పొడుచుకొనఁబోవును)

శకు : ఆ ! పొడుచుకొనకుము. పొడుచుకొనకుము. ఆఁగుమాఁగుము.

ధృత : (లేచి తడవికొనుచు దుర్యోధనునిఁ బట్టుకొని) ఆ ! నాయనా ! ఆఁగుమాఁగుము. నీవేమంటివి ? కొంచెము స్థైర్యముఁబూనుము. సావధాన చిత్తముతో నీ యభిప్రాయ మేదియో విస్పష్టముగ వక్కాణింపుము.

శకు : అతని యభిప్రాయంబున కేమిగాని మీకుఁ దప్పని తోఁపకున్న నేనొక్కమాట జెప్పెదను చిత్తగింపుఁడు.

చ. బుడబుడ పెత్తనంబులను ♦ బూనుటయే తగ దందు వైరులన్
గడగడలాడఁజేయు నృప ♦ కాంతు సుయోధను రాజరాజు నే
పెడపెడ మాటలన్బరిభ ♦ వించిరి యంతటఁబోక నవ్వుటా ?
పొడిపొడిచేసి రావలదె ♦ భూరిగదాహతిచేత నెల్లరన్.

మహారాజా !

గీ॥ ప్రాణములు మేనిలో నిల్చు ♦ నంతవరకు
మఱచునే దీని మది నభి ♦ మానధనుఁడు
పాండవుల నెట్లొ వంచింప ♦ వలయుగాని
శాబు బహుళోక్తితో నవ ♦ సరములేదు.

దుర్యో : నాయనా ! నా ముఖ్యాభిప్రాయము వినుము. దురోదరము నింద్యమైన నగుఁగాక. ఒక్క దురోదరమే యేల ? పాండవులను వంచించుటకై యింక నెట్టి యధమాధమస్థితికైన సమ్మతించెద. నాకుఁ గావలసినది పాండవులను దిరస్కరించుట, మోసగించుట, వంచించుట, నిండు పేరోలగంబున వలవల యేడ్పించుట, యంతియేగాని వేఱొండుగాదు. పాండవుల యున్నతస్థితి నాకు సరిపడదు. కావున జూదమాడుటకన్న నిప్పుడు నా శిరోబాధకు వేరొండౌషధములేదు.

ధృత : నాతండ్రీ నాజీవితాధారా : నీవేమన్నను సమ్మతించెద. నీకై యెట్టి నిందనైన భరించెదఁగాని నీదుఃఖమును మాత్రము చూడఁజాలను నీవు దీనవదనుఁడవై యున్నచో నేను జీవింపలేను. ధర్మజుని సకుటుంబముగా నిచ్చటికిఁ దోడ్కొని రమ్మని విదురు నింద్ర ప్రస్థంబున కనిపెద. నాయనా ! నీవు మాత్రము సంతోషము గల్గి యుండుము. ఈ లోపల ద్యూతమంటప రచనా ప్రయత్నము మీఁరనుండుము. ఇంక నేను బోవుదునా ? శకునీ ! నన్నింటఁ జేర్చివచ్చెదవుగాని రమ్ము. (అని అందరు నిష్క్రమింతురు)

2 వ-రంగము—ద్యూతమంటపము

(పంచపాండవులు, భీష్మద్రోణాచార్యులు, దుష్టచతుష్టయము, విదుర ధృతరాష్ట్రులు, వికర్ణుఁడు ప్రాతిగామి మున్నగువారు యథోచితముగ నాసీనులై ప్రవేశము)

విదు : (చింతతో)

చ. చెడెదవు దుష్టకార్యములు • చేసిన బాండవులన్న ధర్మమం
దెడతెగనట్టి వారలు మ • హేంద్రునినైన జయింతు రాజిలోఁ
గొడుకని క్రూరకర్మమున • కుం దిగఁబోకని యెంతచెప్పినన్
బెడచెవిబెట్టె నంధపృధి • వీపతి తుచ్ఛపథానువర్తియై.

శకు : యుధిష్ఠిర మహారాజా ! ఈ దినమున మీరు వచ్చుటచే మాకు సౌభాగ్యము సిద్ధించినది. పరమాహ్లాదముగ నున్నది. ప్రస్తుతము పరిషదభిప్రాయ మేమనఁగా గౌరవ పాండవులుగలిసి కొంచెము క్రీడార్థముగా నొకటి రెండు గడియలు జూదమాడవలయునని ఆనందమునకై కొంచెము పందెముగూడఁ బెట్టవలయును.

ధర్మ : సభాముఖ్యాభిప్రాయమును విదురముఖంబున నే నీవఱకే విని యుంటి. నిశ్చయముగా జూదము వినాశమునకు మూలము. ధర్మమునకుఁ బ్రతికూలము. సద్బుద్ధికిఁ బ్రళయకాలము. జారత్వ చోరత్వముల కాలవాలము. సంపల్లతలఁ ద్రుంచుటకు గరాళ కరవాలము.

ధృత : నేనుగూడ దుర్యోధనున కిట్టులే చెప్పితిఁగాని ఇతఁడు వినలేదు.

శకు : (తనలో) తిరిగి భేదముగల్గునా యేమి ?

ధర్మ : నేను నిజముగా నీ జూదమును ధిక్కరించెద.

దుర్యో : నీవు సమర్థుండవని బ్రమసి కోరితిమి.

ధర్మ : అయినఁ గానిమ్ము. నేనెవరితో నాడవలయు ?

దుర్యో : ద్రవ్యము నాయది. నావైపునుండి శకునిమామగా రాడుదురు.

శకు : సరే ! నాకంతగా జూదమాడుట రాదు. దుర్యోధనా! ఇంకెవ్వరి నైన నియోగింపరాదా ?

దుర్యో : తప్పదు. మీరే యాడవలయు.

శకు : ఏమీ! ద్యూతకళా విశారదుఁడగు ధర్మనందనునితో నేనా జూద మాడుట? హనుమంతుని దగ్గఱ కుప్పిగంతులవలె నున్నది.

దుర్యో : అయిన మామగారూ! నాముద్దు నింతమాత్రము తీర్పఁగూడదా?

శకు : సరే! యేమిచేయుదుము. నీమాటఁ ద్రోసిపుచ్చరానిదగుటచే విధిలేక సమ్మతింపవలసి వచ్చినది.

ధర్మ : (తనలో) ఒకరిద్రవ్య మొకరాడుటయా?

భీము : ఇందేమో తప్పక రహస్యమున్నది. (అని తనలో ననుకొనెను)

ధర్మ : చింతలేదు. జూదమాడెద. ఇదిగో బంగారు గిన్నెలు. వీనితో సమానమైన ధనముఁ బందెముపెట్టుము. (శకుని పందెముఁ బెట్టిన తర్వాత పాచికలు వేయును)

శకు : బాగుగఁ జూడుము. మూడుబారాలు, ఆరు, పదునెనిమిది. ఈ పందెము నేను గెల్చితి.

ధర్మ : నే నమూల్యమైన యీ హారము నొడ్డితి. (వేయును)

అర్జు : ఈ యాటలోఁ జక్కా పెద్దదిగావున నివిగో రెండుపడినవి. మీరోడితిరి.

శకు : అవును. పందెము మీదిగావునఁ గురురాజోడెను.

విదు : (తనలో) పాచికలు నీవుచెప్పినట్లు వినునుగాన సుయోధనుఁ డోడెను. ఇంక ధర్మజుఁడోడును. నీయిష్టమువచ్చినట్లు చేయుము. ధర్మరాజున కీ పందెము వచ్చుట యతికష్టముల ననుభవించుటకే,

దుర్యో : తీసుకొనుఁడు. మా సకలాభరణంబులను బందెముగాఁబెట్టితి.

ధర్మ : పెట్టుము దీనికి నేను భయంపడను. వీనికి మారుగా మా చతురంగంబులను మా సర్వాభరణంబులను బందెముగాఁ బెట్టితి. (వేయును)

శకు : ఈ పందెము నేను గెల్చితిని.

విదు : (తనలో) పూర్వజన్మ సంచిత పాపపరిపాక విశేషంబునం జేసి యెట్టి ప్రాజ్ఞుఁడును శుద్ధమూర్ఖుఁడై సంపదతరుగఁ దనంతటతానే వెఱ్ఱియగును.

భీష్మ : ధృతరాష్ట్రా! నీవు కురుపాండవులకు జూదమాడ ననతిచ్చి నందున నీ యుభయవంశములకే గాక జగంబునకంతకుఁ జెరుపు జేసినవాఁడవైతివి.

ధృత : నేనేమి చేయుదు? చెప్పిచెప్పి వినకుండుటచే మిన్నకుంటిని.

భీష్మ : నేను జాలసేపటినుండి చూచుచున్నాఁడను. అధమాధమమైన యీ జూదమువలన విదురున కతిసంతాపము గల్గుచున్నది. ఈ ఘోరదుఃఖమువలన నాతని హృదయము క్షోభించుచున్నది. ఇప్పటికైన నీయాట ముగింపఁజేయుము. విదుర వాక్యము మంగళప్రదముగానెంచి సమ్మతించుట శ్రేయస్కరము.

విదు : మహాత్మా! కురుపితామహా! నేనెవరికేమి చెప్పఁగలను? వీరికి నా వాక్యములు కర్ణకఠోరములుగా నున్నవి.

భీష్మ : తండ్రీ! విదురామాత్యా!

గీ॥ అవును నీమాటలెంతయు ♦ నమృతసమము
లైన వీరికిరుచియింప ♦ వక్కటకట
యరయ రోగనివారక ♦ మైనఁగాని
చావనున్నట్టివాని కౌ ♦ షధముమాడ్కి.

విదు : అన్నా! ధృతరాష్ట్రా! దైవేచ్ఛవలన నీవు నేత్రములచే నంధుఁడ వైతివిగాని బుద్ధిచేఁ గావుకదా? దుర్యోధనుని దురాచారమును గనులతోఁ జూడలేకున్నను. నా నోటివలన నీ చెవులతోవినుము. నీ ప్రియకుమారుఁడు కుమారాగ్రేసరుఁడు, వంశోద్ధారకుఁడు నీ మహదన్వయమునంతయు నాశముఁజేయ సామగ్రి సిద్ధపఱచు చున్నాఁడు. నిశ్చయముగా నిది నమ్ముము.

ఉ. ముద్దులుమూటగట్టు మణి ♦ పుంజముచే నలరారు మేడలన్
బెద్దలు పిన్నవారునెటఁ బ్రీతిఁజరించిరో ♦ యట్టితావులన్
వద్దయు భీత భీతగతిఁ ♦ దాండవమాడుచు నింకమూఁగెడున్
గ్రద్దలు గబ్బిలంబులును ♦ గాకులుఁ గుక్కలు గుడ్లగూబలున్.

ధృత : నీవు దుర్యోధనుని సమాధానపఱుపుము.

దుర్యో : నాయనా ! నీ పీతనిమాటల నమ్మవలదు. రెండుగడియలు ప్రొద్దుపుచ్చుకొనుటకు న్యాయముగా జూదమాడిన నేమినష్టము?

ధృత : తమ్ముఁడా ! విదురా ! నేనేమిచేయుదు ? పుత్రమోహ మని వార్యముగదా !

విదు : అవును. దైవయోగముమాత్ర మనివార్యముగాదా : అన్నా ! యిట్టి పుత్రునిపై మోహమా ?

ధృత : కొంచెము పనికొఱకు కుమారుని విడనాడుదునా ?

విదు : (నిర్భయముగా) విడనాడుము, వదలిపెట్టుము, క్రూర సంబంధము తగదు. రెండువంశముల కొకమనుష్యుని, ఒక గ్రామముకొఱ కొక కుటుంబమును, ధర్మజిజ్ఞాసకు జగంబును విసర్జించవలయు. అపకీర్తిదెచ్చు కుమారుని. బుద్ధిమంతుఁడుగాని స్నేహితుని, ప్రేమలేనితల్లిని, సిగ్గులేనిభార్యను, కామోద్రేకము గల సన్యాసిని, నమ్మకములేని భటుని, యన్యాయకారియగు యజమానుని. ఆశగల గురుని, అవిధేయతఁజూపు శిష్యుని, అధర్మపరుఁడగు తండ్రిని నిస్సందేహముగా, నిర్వివాదముగా, నిరాక్షేపణగాఁ బరిత్యజింపవలయును. మరియు—

దుర్యో : (కోపముతో ఓహో ! శ్రుతిమించి రాగమునఁ బడుచున్నదే ? ఓయి విదురా !

క. పగ్గెలు వల్కెదు జనకుని
దగ్గఱ వసియించి యింత ♦ తగునే ? యహాహా !
యిగ్గతి నీ బ్రతుకునకె
సిగ్గువడుమువేగ పాడి ♦ చెప్పఁగనేలా ?

మా కొఱకుఁ గాకపోయినను, మాయన్నపానాదులఁ గూర్చియైన సిగ్గు పడుము.

భీష్మ : (కోపముతోలేచి) ఏమేమీ!

చ. ధరణిని నీవెగెల్చిన వి ♦ ధంబునఁ దిట్టుచునుంటివోరి ము
ష్కర! సభలోపల న్మదము ♦ కన్నులఁ గప్పగఁ బెద్దపిన్నయం
తయును నెఱుంగ కన్నిటను ♦ ధన్యతఁగన్న మహామహున్, దలన్
గొఱివిని గోకికొన్నగతి ♦ నోటికివచ్చినరీతి నిత్తఱిన్.

విదు : పితామహా! శాంతింపుము, శాంతింపుము.

గీ॥ తాత! లోకైకపూత త ♦ థ్యముగఁజెడ్డ
వారికి న్నీతినుడువ లా ♦ భంబుగలదె!
పూని వెఱ్ఱిచేష్టలుచేయు ♦ వానరమును
బిలిచి భాగవతంబు వి ♦ న్పించినట్లు!

(దుర్యోధనునివంకఁదిరిగి) మహారాజా! దుర్యోధనా! మీరు నాయందు జాలదయగల్గి మీయన్నమును నాపొట్టనించుచున్నారు. ఆసిగ్గువలననే నేనును జారిపడకుండ మంచిమార్గమును జూపుచున్నాఁడను.

ధృత : నేనుఁగూడ నిదియే యనుచున్నాఁడను.

విదు : (కోపముతో) ఏమనుచున్నాఁడవు; మన్ననియా? మసియనియా? నీవు రెండుఱాళ్ళనురాఁచి యగ్నిహోత్రమును బుట్టించితివి.

గీ॥ స్వచ్ఛమైనట్టి కౌరవ ♦ వంశమెల్లఁ
బాడు సేయుంగ వీనిని ♦ బడసితీవు
రాజమీరెడు కర్పూర ♦ రాసిమీఁద
నగ్నికణికనువైచిన ♦ యట్టులకట!

ఇప్పటికైనఁ దెలిసికొనుము. దుర్యోధనుఁడు పరమమూఢుఁడు. వీని మాట వినవలదు.

ధృతి : దీనినిగూర్చియే నాలోనేను దిగులుపడుచుంటి. నీయిష్టప్రకారము సభ నిప్పుడే ముగింపజేసెద. అబ్బాయి! దుర్యోధనా! యింక జూదముచాలు. పాచికలు సలుగఁగొట్టుము.

దుర్యో : తండ్రీ ! వారి యసూయావాక్యములనే నమ్మి రంగమునకు భంగముగలుగఁజేసెదవేమి ? ఒకవేళ నితరులకు దురోదరము క్రూరమైనను మాకిందుహానిలేదు.

ధృత : ఇందెవరికి హానిరాఁగూడదు. వేసినపందెము తప్పదు. తిన్నగా నాడుకొనుఁడు. మొదటనిచ్చిన యాజ్ఞకు మారుజేయుట మంచిదిగాదు.

శకు : మీ చతురంగబలమును, మీ సర్వాభరణంబులును మాకోడితి రింకేమున్నది ?

ధర్మ : సహదేవుని ముక్తాహారమును బందెముఁబెట్టితిని.

భీష్మ : ధర్మనందనుఁడు దేహమునే మఱచియున్నవాఁడు.

శకు : మీసర్వాభరణములలోనే సహదేవుని ముక్తాహారము గలదు.

ధర్మ : ముక్తాహారము లేకున్నమానె. ఇదిగో వినుము.

గీ॥ ఎప్పుడును నాయనుజ్ఞ యిం ♦ తేని దాఁట
కుండ వర్తించువాఁ డుత్త ♦ మోత్తముండు
అఖిలసద్గుణగణముచే ♦ నలరువాఁడు
చిన్నతమ్ముఁడు పందెము ♦ బెట్టబడియె

శకు : (పాచికలువేసి) ఇదిగో ! ఈపందెముగూడ మేమే గెల్చితిమి. నకులునిగూడ పందెముఁ బెట్టెదవా ?

ద్రోణ : (తనలో) ఆహా ! ముక్తాహార ప్రసంగవశమున సహదేవుఁ డోడఁబడెనుగదా !

ధర్మ : (బిగ్గరగ) ఓయి ! శకునీ ! యప్పుడే యేమైనది. ఇదిగోవినుము.

గీ॥ సకల సజ్జనులకు ♦ సంజీవనంబయి
నాయనుజ్ఞమీఁద ♦ నడచునట్టి
గర్వహీను శాంతు ♦ ఖండితవైరిజు
నకులు నకులు బెట్టి ♦ నాఁడ విచట.

శకు : (పందెమువేసి) అహా ! చూచితివా ? తిరిగి నేనే గెల్చితిని.

ధర్మ : (ఆవేగముతో)

మ. సభవారందఱు చూడ టామ్మని ధను ♦ ష్టంకారమున్ జేసి వీ
రభరామంత్రము మత్స్యయంత్రము ను ద ♦ ద్రావంబు దిగ్దంతిదం
తభయంబుంగలిగింపఁ ద్రుంచెనెవఁ డా ♦ దర్పాతిరేకారినా
ధభిధామోదిత విక్రమక్రమకళా ♦ ధౌరేయు నిం దొడ్డితిన్.

శకు : కానిమ్ము. నేనుఁగూడ నా యదృష్టమును పరీక్షించెద ! (వేసి) నేనే గెలిచితిని.

విదు : విధి బలవంతమగుటచే ధర్మజుఁడిప్పుడు జ్ఞానశూన్యుఁడును, నీతిరహితుఁడు నయ్యెను.

శకు : —ఇప్పుడు భీమునోడెదవా ?

ధర్మ : (దుఃఖకోపములతో) ఇప్పుడు నేనేమిసేయుదు. కాలమహిమ యెట్టివారికి నను ల్లంఘనీయ మనుమాట యనుభవముమీఁదగాని తెలియదు. (విచారించి) అయినను భయములేదు. ఓయీ మామా ! పందెమిదిగో వినుము.

ఉ. హుమ్మన పాదఘట్టనల ♦ నుర్వి చలింప గదాద్వితీయుఁడై
గిమ్మనకుండ శత్రువుల ♦ కీలెడలంబరిమార్చి పేర్చి క్రో
ధమ్మునుబట్టఁజాల కమి ♦ తమ్ముగ దిక్కులుమ్రోయ సింహనా
దమ్ముల దుర్నిరీక్ష్యుఁడగు ♦ తమ్ముని భీముని బందెమొడ్డితిన్.

భీష్మ : (నతలో) ఆహా ! కాలమహిమ !

గీ॥ మించిగదచే హిడింబుఖం ♦ డించి బకుని
జించి కిమ్మీరునిన్ వధి ♦ యించి ఘోర
సమరమున జరాసంధుజీ ♦ వములుగొనిన
యగణితపరాక్రమునకు నెం ♦ తగతిబట్టె

విదు : (తనలో) ఓరీ ! శకునీ !

గీ॥ పాచికలు నీయధీనమై ♦ పరగుకతన
నెట్లువైచిన జయము నీ ♦ కే లభించు

హాస్యమెంతయు స్వాధీన • మైనకతన
నెట్లుపాడిన మోదము • నిచ్చునట్లు.

శకు : ధర్మనందనా! యీ పందెము బాగుగాఁజూడుము. (వేసి) ఈపందెముగూడ మేమే గెల్చితిమి. పాప మిప్పుడు నీవుదక్క నింకెవ్వరునులేరు.

ధర్మ : (ధైర్యముతో) కానిమ్మిదిగో వినుము.

చ. ఇమ్మగు మేడలన్మణుల • నెల్ల ధరిత్రితలమ్ము. జిత్రచి
త్రమ్ములనోడి సిగ్గిలక • తానును బూరుషుఁడేయటంచుఁ జి
త్తమ్మున నెంచి శూరులగు • తమ్ములసైతము వీడినట్టివాఁ
డిమ్మనుజాధముండు సభ • నెల్లరు సీయనఁ బందెమయ్యెడున్.

అందరు: (బొమ్మ బాదుకొనుచు) అయ్యో! అయ్యో! యెంతగతిబట్టె నెంతగతి బట్టె!

శకు : (సంతోషముతో) ఓ భగవంతుడా! నీ విప్పుడే యుంటివల యును. (వేసి) ఇదియు మేమే గెల్చితిమి.

ధర్మ : (విచారముతో) అయిపోయినది.

దుర్యో : ఏమైపోయినది?

ధర్మ : మాసర్వస్వ మైపోయినది. మారాజాభిమానము సడలిపోయినది. మా గౌరవము తీరిపోయినది. మా గర్వము వదలిపోయినది. మా సమస్తసామ్రాజ్య మస్తమించిపోయినది. మా యఖండ వైభవమును మటుమాయమై పోయినది. ఇంక మీదాసులమగు టకు సమ్మతించితిమి. మీపాదములు మాశిరమున మోపిన మోసి పనిఁజేయుదుము. మీచేతఁజిక్కితిమి. మీచిత్తమునకు వచ్చిన పనినిఁజెప్పి జేయించుకొనవచ్చును. మా దురదృష్టవశము మమ్మీపాచికలు దాస్యమున కప్పగించినవి.

దుర్యో : నీవన్నది సత్యమైనను, మాసర్వస్వమైపోయినదనుమాటమాత్ర మసత్యము. అమూల్యమైన మాణిక్యముమాత్రము మీచెంత నున్నది.

ధర్మ : అదేమియో చెప్పుము.

దుర్యో : ద్రౌపదీమాణిక్యము.

భీష్మ : ఛీఛీ ! యెంత నీచమైనమాట ! యెంత నీచమైనమాట !

ధర్మ : బాగుగనున్నది.

అందరు: (ఆశ్చర్యముతో) ఆహా ! బాగుగనేయున్నది.

విదు : ఈ బాగు మహాసహ్యాకరముగ నున్నది.

ధర్మ : దుర్యోధనునిమాట ధిక్కరింపఁదగినది కాదు.

ధృత : అగు, నీయభిప్రాయ మూరక త్రోసిపుచ్చఁదగినదికాదు. యీ యోడినదంతయు నొకవేళ యామెమూలమున నైన వచ్చిన రావచ్చును. మీరును మా ద్యాసమునుండి విముక్తులైనఁ గావచ్చును.

భీష్మ : (కన్నులెఱ్ఱజేసి) ధృతరాష్ట్రా ! నోరుమూసికొనుము. నీ గతి యింకముం దెట్టుకాఁగలదో విచారించుకొనుము.

అర్జు : అన్నా ! నేనెక్కువగాఁ జెప్పుటకుఁ జాలనివాఁడనయ్యుఁ జెప్పుచున్నాఁడ, క్షమింపుము. నీవు త్వరపడక విచారించి మరి యాడవలయును.

భీము : నామనవిగూడ నాలింపుఁడు. చిన్న చిన్నగనే యుండవలయు. పెద్ద పెద్దగనే యుండవలయు. మానోటికి తాళము వేయుట లోనే క్షేమమున్నది.

ధర్మ : భీమా ! నీమాట నాకేమియు బోధపడకున్నది.

భీష్మ : ఎట్లు బోధపడును ? జ్ఞానమను కవాటము మూయఁబడియున్నది. తెలిసికొనుశక్తి జూదమను మత్తతలో మగ్నమైనది.

దుర్యో : ఏటికాలస్యము, పాచికలు వేయుఁడు.

శకు : ధర్మనందనా ! యేల సంకోచించెదవు ?

దుర్యో : ఈ పందెము నీకుఁ దప్పక వచ్చును. దీనికిమాఱు నీ వోడిన దంతయుఁ బందెముఁ బెట్టితి.

శకు : సందేహింపకుము. యీ యాలస్యము మాకు సరిపడదు. కాకున్నచోఁ జేతఁగాదనియైన నుడువుము.

ధర్మ : (కోపముతో) ఏమేమీ ? యీమారు క్షమించితి. ఇదిగో వినుము.

సీ. నరకకూపంబునఁ ♦ దొరలించు నన్నృత మే
భవ్యచరిత్రకుఁ ♦ బ్రబలవైరి
యన్నిట నుత్తమం ♦ బైన ప్రాణేశ్వర
సేవ యే సాధ్వికి ♦ జీవనంబు
శాంతిదయాసత్య ♦ సౌశీల్యగుణము లే
యుగ్మలి త్రావిన ♦ యుగ్గుఁబాలు
మహనీయ సాధుస ♦ న్మానంబుపుట్టక
మున్న యేసతి నేర్చు ♦ కొన్నచదువు

గీ॥ దివ్యసద్గుణవల్లి స ♦ తీమతల్లి
కాంతలకు మేలుబంతి య ♦ య్యింతి పాండు
రాజు కోడలు కాలక ♦ ర్మంబుచేత
నిండుసభలోనఁ బందెమై ♦ నెగడె నేఁడు.

శకు : పాచికలయందున్న యో కాళికాదేవి ! మమ్మనుగ్రహించు సమయ మిదియే. యీ పందెముపై ద్రౌపది నుంచిరి. కాన వ్యర్థము గాఁగూడదు. (వేసి) ఇదియు మేమే గెల్చితిమి.

దుర్యో, దుశ్శా, శకు, కర్ణ : అహ్హాహ్హా, అహ్హాహ్హా, అహ్హాహ్హా (నవ్వుదురు)

దుర్యో : నా యభిప్రాయానుసారముగా ద్రౌపదీదాసికూడా వచ్చినది.

విదు : ఏమి ! యీ కటికచీఁకటి ! యేమి ! యీ పరమాత్మని మాయ ! (మూర్ఛిల్లును)

దుర్యో : ప్రాతిగామీ ! నీవు శీఘ్రముగఁబోయి ద్రౌపదినిఁ దోడ్కొనిరమ్ము.

ప్రాతి : చిత్తము. (నిష్క్రమి)

దుర్యో : భీమా ! యిప్పుడు గూడఁ గ్రుద్ధుఁడవై యున్నట్లు గన్పట్టు చున్నాఁడవు. ఏమట్లు కన్నులు పెద్దజేసెదవు ?

భీము : కన్నులా? కన్నులా? యిప్పుడు నీపైఁ గినుకవహించుట కవకాశములేదు. ఏలయన మా యన్నగారిప్పుడు కోపమను రంగస్థలముఁ గన్పింపకుండుటకై శాంతియను తెర వైచి యున్నారు. మర్యాదయను సేవకుఁడు కోపమను చోరుని దాపుఁ జేరకున్నవాఁడు. లేకున్నచో నా—(పండ్లు పటపట గొరుకుచు మీఁదఁ బడఁబోవును)

అర్జు : (పట్టుకొని) అన్నా! శాంతింపుము, శాంతింపుము.

భీము : (దుర్యోధనునిఁజూచి) లేకున్నచో నా? యీపాటికిఁ బీనుఁగ రాసులం జూచియుందువు. నీవున్నతావున నొక్క పెద్ద భస్మ రాశియుఁగూడ నుండును.

దుర్యో : (నవ్వుచు) ఈ యాలోచన మొదట నిక్కడనుండి లేచి యల్లదిగో! నా సేవకపంక్తిలోఁ గూర్చుండి చేయుము. ఏమీ? ఆకాలము జ్ఞప్తిలేదా? నన్ను కొలనులోఁ బడవైచి నవ్వితివే? ఇప్పుడదియంతయు మరుపువచ్చెను గాఁబోలు! పాపము! నీవు హంసతూలికా తల్పంబునఁ జాల సుఖపడితివి. ఇప్పుడు నిన్ను రాళ్ళపై, మట్టిబెడ్డలపైఁబరుండఁబెట్టెద. నాయశ్వములఁజక్కఁగా దోమవలయును. తట్టఁజేఁబూని వీధివీధులనున్న పెంటల నెత్త వలయు. సభాస్థానమున సేవగావించుటకై వేళకు సిద్ధముగా నుండవలయును, ఒకహస్తమందుఁగుతారము, ఒకహస్తమందుఁ జామరమును బట్టుకొని ద్వారదేశమున నిల్వవలయును. జాగ్రత్త! లేనియెడల నీవుండవు.

భీము : (మహాకోపముతో) ఓరీ మూఢ దుర్యోధనా! అన్యాయార్జిత రాజ్యసంపల్లవదుర్విదగ్ధా! నోరు కాపాడుకొనుము. నోరు కాపాడుకొనుము.

గీ॥ శాంతిచే నిన్ను ద్రుంపవి • శ్రాంతిలేక
గొట్టుకొను నన్ను దిట్టబో • కుము దురాత్మ
ప్రకటముగా విధిచేత జు • ట్టుకొనియున్న
పాముసరిమ్మది మట్టిన • బ్రతుకబోవు.

(ధర్మజునిదిక్కై) అన్నా ! వినుచుంటివా.

ఉ. నేరము మేరమీరె నని ♦ నీతికి నింతయు నడ్డులే దహం
కారము ఘోరమయ్యె ఘన ♦ గర్వము కన్నులఁదట్టె నెంతయు
న్గ్రూరుఁడువీఁడు నిండుసభ ♦ నోటికివచ్చినరీతి వాఁగెడున్
గోరెద నాజ్ఞయిమ్ము పుడె ♦ గుండెలు వ్రక్కలొనర్తు నగ్రజా !

ధృత : కుమారా ! దుర్యోధనా ! నామాట వినుము. ద్రౌపది యిక్కడి వచ్చునదికా దామెను రప్పింపకుము.

దుర్యో : ఏలరాదు ? వీరామె నోడనేలేదా ?

భీష్మ : ధర్మజుఁడు తనయొడలు తాను గుర్తింపకయున్నప్పుడోడినాఁడు. మృగయావిహారమున వేఁటకాఁడు నిమ్నోన్నతముల గుర్తింపక యెట్లు పరుగిడునో, సురాపాన విజృంభణమున దుర్వ్యసనుఁడు మత్తతలో నెట్లు మునుంగునో, ఘోరయుద్ధమున వీరభటుఁడు తన శరీరమునుగూడ మరచి స్వకీయులనునైత మెట్లుదున్మాడునో పునఃపునర్విత్తసంగ్రహణకౌతూహలమున పరమ లుబ్ధుఁడుత్యాగ మహత్వము నెట్లు తెలియకుండునో, కామోద్రేకమున నింద్రియ లోలుఁడు స్వపరస్త్రీభేదములెల్ల విడిచి నిరంతర మెట్లు కాంతా ప్రసంగమునంబడి కొట్టుకొనునో, అట్లే సర్వధర్మవేదియయ్యును ధర్మనందనుఁడు రోషావేషమున నొడలుతెలియక ద్రౌపదినోడెను.

దుర్యో : ఎట్లోడినను ఓడినవాడేకదా ! ఇదిగాక యొకవేళ యాబంధకి యిక్కడికివచ్చిన దానికీర్తి నష్టమగునా ? లోకమం దేకాంత కొక్కపతి యుండునో యాకాంత సంసారిణి యనఁదగుంగాని దీనికి బతులేవురున్నవారు. కావున బంధకి యని నిర్వివాదముగా వక్కాణింపవచ్చును. అట్టి బంధకికి మానాభిమానములుగూడనా? దాని నేమి చేసినను దోషములేదు.

భీము : ఓరీ చండాలుడా ! యేమంటివి ? (కొట్టఁబోవును)

ధర్మ : తమ్ముడా ! భీమసేనా ! శాంతింపుము.

దుర్యో : (రోషముతో) ఓరీ సేవకా : వీనికింకను మదము తగ్గలేదు. పెడరెక్కలు విఱచికట్టుము.

ప్రాతి : (ప్రవే) జయము జయము మహారాజ !

దుర్యో : ఓరీ ! దాసీని తీసుకొనిరాలేదేమిరా ?

ప్రాతి : మహారాజా ! మీయాజ్ఞ నాదేవికి విన్నవించితిని.

దుర్యో : వినినదా ?

ప్రాతి : ఆఁ వినినది. తోడేలుమాటను సింగము వినినట్లు వినినది. తనకుఁ దిరస్కారము సంభవించెనని ముఖవర్చస్సుచేఁ దెల్పినది.

ద్రోణు : నీవు తెల్పినవార్త యామెకు బాణమువలెఁ దగిలినదికాఁబోలును.

ప్రాతి : నిస్సందేహముగా ద్రౌపదీదేవి క్షత్రియపుత్త్రిక గావుననే దుఃఖమును జయించి క్రోధశాంతికై తలవంచి యూరకున్నది.

దుర్యో : తర్వాత జరిగిన సమాచారముఁ దెల్పుము.

ప్రాతి : ఆయమ ముఖమంతయు వెలవెలబోయి పచ్చఁబడి మూర్ఛాక్రాంతమైనది.

దుర్యో : అట్లే కావలయు. తర్వాత ?

ప్రాతి : చెలులవలనఁ దెలివంది సభాసదులకొక విన్నప మొనర్చుమని నన్నంపెను.

దుర్యో : ఏమని ?

ప్రాతి : "నేనిప్పు డేకవస్త్రను, రజస్వల" నని.

దుర్యో : ఓరీ ! నీవు మరలఁజని యిట్లనుము. "నీప్రార్థనము విశ్వసనీయముగాదు. ఏకవస్త్రవైనను, వివస్త్రవైనను రాకతప్పదు" అని.

ప్రాతి : (రిచ్చవడి యూరకుండును)

దుర్యో : ఓరీ పోవేమి ? యేమో విచారించెదవు. భీమార్జునులకు భయపడితివా ?

ప్రాతి : మహారాజా ! నాకెవ్వరిభయము లేదు.

దుర్యో: అయిన నేల యాలసించెదవు ?

ప్రాతి : కాని పరమాత్మునకు భయపడు చున్నాఁడను. ధర్మమునకు భయపడుచున్నాఁడను. న్యాయమునకు భయపడుచున్నాఁడను. ఆయమ మహాపాతివ్రత్యమునకు భయపడుచున్నాఁడను. ఈనీచ కార్యమునకై ముందు గాలుబెట్టవలెననిన శరీరమంతయు గడగడ వడఁకుచున్నది. ఆ సతీ శిరోమణిచెంత కేగవలెనన్న పాదములు తొట్రుపడుచున్నవి. ఈ యధమాధమ సందేశాహరణభారమున లజ్జ యధికమగుచున్నది, ఆమె ధర్మము, ఆమె గౌరవము, ఆమె యాశ్రితవాత్సల్యము, ఆమె పాతివ్రత్య ప్రభావము, ఆమె సౌశీల్యము, ఆమె ప్రస్తుత మీకార్యము మూలమున ననుభవించెడి నిర్వేదము. బోయిచూచిన నా శౌర్యము మాయమగును. ఇక్కడ నున్న ధైర్య మక్కడకుఁ బోయిన నుండదు. ఆమె మహిమ వలన శక్తి తక్కువై యభిప్రాయము మారును.

దుర్యో: ఏమిరా ప్రాతిగామీ ?

ప్రాతి : చిత్తము స్వామీ ?

దుర్యో: బహుసంభాషణమువలదు. ద్రౌపది నీడ్చితెచ్చుటకుఁ బోయెదవా? నీ శిరమును ఖండించుటకు ఖడ్గము నెత్తుమందువా ?

ప్రాతి : ఇట్టి పురుషహీనమగు జీవితముకన్న మరణమే యుచితము. ద్రౌపదీ మహాదేవి నీడ్చితెమ్మనినఁ జింతయగునుగాని యీ ఖడ్గముతోఁ గ్రుచ్చుకొని గతింపుమన్నఁ జింతలేదు. లోక యును నా యెడ ద్వేషము వహించినను నేనామెకడకుఁ జనను. ఆ సాధ్వీరత్నముమీదఁ జేయివైచినచో నా చేయి యట్లే పడి పోవును. ఆ యమ్మ చరణారవిందములకు దేవతలు గూడ నమస్కరింతురు. ( అని లోలోపల దుర్యోధనుని దిట్టుకొనుచు నిష్క్రమించును.)

దుర్యో: తమ్ముఁడా! దుశ్శాసనా! నీచుఁడు. వానితోనేమి? నీవుపోయి యా బంధకి నిక్కడికీడ్చుకొని రమ్ము. ఏకవస్త్రయఁట. పాపము! ఏకవస్త్రయఁట. వస్త్రమూడిపోయిననుసరే. సభామధ్యమున వదల వలయును. (దుశ్శా—నిష్క్రమించును)

భీము : అన్నా! నీవు వినుచుంటివా లేదా? ఇవి మాటలుగావు, కత్తులు. ఈ కత్తులు నా చిత్తమునుగోసి కండలుచేయుచున్నవి. ఇంతకన్న నా కంఠ ముత్తరించి వారిచెంతఁ బెట్టుము. ఏమి మాటాడవు?

గీ. మా బలంబంతయును గటా ♦ మంటఁగల్పి
వెడగు దుర్యోధనునిముందు ♦ వేసి తీవు
కఠినమైనట్టి డేగ రె ♦ క్కలను గోసి
యూరపిచ్చుకకడఁ జేర్చు ♦ తీరుదోఁప.

దుశ్శా : (ద్రౌపదిని వెంటాడుచుఁ బ్రవేశము)

ద్రౌప : ఓరీ విద్యావిహీనుఁడా! సిగ్గులేనివాఁడా! చండాలుఁడా! నే నేక వస్త్రనురా! రజస్వలనురా! దూరముగా నుండవేమిరా?

గీ. ఓరి యధమాధమా యింత ♦ ఘోరవృత్తి
నన్ను వెంబడించుట నీకు ♦ న్యాయమఁటర!
గాటమై తనరారెడు ♦ వేఁటకుక్క
మంచి లేఁడిపిల్లను వెంబ ♦ డించినట్లు.

దుశ్శా : ఓసీ! నీవీ దినమున దుర్యోధన మహారాజుగారి దాసివైతివి. ఆ మహారాజు ముందు జయలక్ష్మియే చేతులు జోడించుకొని యుండ నింక నీవెంత?

ద్రౌప : ఓరి దుష్టాత్మా: హాని కంతమున్నదిరా! (సభవంకఁ దిరిగి) కటకటా! యీ సభ గ్రుడ్డిదా? చెవిటిదా! మీరందఱుగూడ చెవులలో దూది నింపుకొనియుంటిరా? రాజభయమను మేకులు మీ నాలుకలపై నాటెనా? ఈ సభాసదులందఱు నింతటి భయంక రోత్పాతమును, ఇంతటి మహాధర్మ విప్లవమును కన్నులారఁ

గాంచుచుండియు గుడిమీఁది బొమ్మలవలె గ్రుడ్లు వెళ్ళబెట్టుకొని బెల్లముగొట్టిన రాళ్ళవలె మిన్నకున్నవారేకాని, యీ మూర్ఖుని యీ నరాధముని యీ వంశనాశకుని యీ పరస్త్రీ పరధనవాంఛా దూషితు నొక్కరేని లేచి "యిది నీకు తగదు. ఇట్లే యింకను దుష్కార్యాచరణమునకుం గడంగినచో నిన్ను కండకండలుగ ఖండింపకమానము. నీశిరమును తుత్తునియలు గావింపకవిడువ" మని యెదిర్చి సాహసించి వాక్కాణించి ధర్మమును సంరక్షించువారు లేరే? ఇది యేమిపాపము? లజ్జలేనివారా? పౌరుషము లేనివారా? శౌర్యము లేనివారా? మానము లేనివారా? తల్లులు లేనివారా? సోదరీమణులు లేనివారా? భార్యలు లేనివారా?

దుర్యో : తమ్ముడా! అది యట్లే వాగుఁగాక. నీపని నీవు గానిమ్ము. దీని వస్త్ర మూడఁబెరుకుము. ఎవ్వరెవ్వ రడ్డము వచ్చెదరో నేను నించుక చూచెదనుగాక!

భీము : ఓ భగవంతుఁడా! యెంత సంతాప మెంత సంతాపము! ఎవఁడో యొక్క నీచుఁడు నిండోలగంబున పాండవేయుల పట్టమహిషిపై జేయివైచి బ్రతికిబోయినప్పుడీహస్తము లెందులకుఁ గాల్పనా?

ద్రౌప : ఈ దినమున ద్రోణాచార్యుల ధనువు త్రుప్పుపట్టెనా? కృపాచార్యుని కత్తి విరిగిపోయెనా? అశ్వత్థామబాణము నంతరిక్షము ద్రిమింగెనా? భీష్మ పితామహుల నాలుక తెగిపోయెనా?

అర్జు : తాతగారూ! ఇఁక జాలును. కర్తవ్యమున కనుజ్ఞయిండు. సహింపవశముగాదు.

భీష్మ : కుమారా: శాంతింపుము, నేనేమి చేయుదు? మీ ధర్మమే మిమ్ము రక్షించును. అధర్మ మెంతకాలమో నిల్వజాలఁదు మీరందరును గలిసి మీ యగ్రజుని గౌరవమును గాపాడుఁడుఁ మీకిదియే నుపదేశించు కర్తవ్యము.

ద్రౌప : పరమాత్మా ! వాసుదేవా ? నా దుఃఖము నీకుఁ గన్పించుటలేదా ? నా శరీరమం దెట్టి శ్రమగల్గియున్నదో కన్నులనుండి యశ్రుధార లెట్లు గారుచున్నవో నా హృదయ మెంతగా క్షోభించుచున్నదో సర్వజగద్వ్యాపియగు నీకుఁ దెలియకున్నదా ? ద్రుపదరాజ పుత్త్రికను. అయోనిజను, పాండుమహారాజేంద్రుని కోడలను. కౌంతేయుల ధర్మపత్నిని. పతివ్రతను, ఏకవస్త్రను, కన్నుఁ గానక యీ దుర్మార్గుఁడు కడుంగడు బాధించుచున్నవాఁడు. నాకు నీవుదక్క యింకెవ్వరున్నారు ? నా యవమానమును దూరము జేయువాఁడవు నీవే. నా మానమును సంరక్షించువాఁడవు నీవే. నాగతి విచారించువాఁడవు నీవే. ఓ సర్వజ్ఞమూర్తీ! ఓ పరమాత్మా! ఓ జగదీశ్వరా ! ఓ దేవకీనందనా ! ఓ దీనవత్సలా: ఓనాతండ్రీ! శ్రీకృష్ణా !

ఉ. అపదఁజెందియుంటి నిను ♦ నర్థిభజింపఁగ బూనుకొంటి సం
దీపితుఁడైన యీ పరమ ♦ నీచునిచే శ్రమఁజెందుచుంటి సం
తాపముఁ బాప నీదుచర ♦ ణద్వయమే శరణంటివేగ రా
వే, పరికింపవే, మనుప ♦ వే, భవమోచన ! పద్మలోచనా !

దుర్యో : (నవ్వుచు) ఓసీ ద్రౌపదీ !

గీ॥ కలికి కనుఁగొలుకుల జల ♦ జలస్రవించు
బాష్పములనెంచ దాసీని ♦ భవముకొఱకె
యవనిరుహములపైని బా ♦ లాతపంబు
కొమరుమించు బెన్నఁగం బ్రొద్దు ♦ గ్రుంకుకొఱకే.

ఇంక నిముసములో నీవు నా దాసీ సమాజములోఁ గూర్చుండ గలవు. నన్నుఁగాదని నీవు చేయునది యేదియునులేదు. ఓ కుందరదనా ! భుజముపైఁ జామరమును బెట్టుకొని మోయ వలయును. ఇదిగో నా పాదము లొత్తవలయును.

ద్రౌప : ఓ మూఢదుర్యోధనా ! యేల విఱ్ఱవీగెదవు ?

గీ. అరరె నీ కాళులౌకలెక్క • యా దురాత్మ !
విను ము నా ప్రాణనాధులే • యనుమతించి
నట్టులయినచో నభిమాన • మవలద్రోసి
కుక్క కాళులంగడిగి త్రా • గుదును సుమ్మ.

అమితదుఃఖ మబ్బినను నా ప్రేమము నా భర్తలమీఁదఁ దక్కవ కాదు. ఈ శరీరము పాండవులది. వారెట్లుచేసినను సమ్మతించెద.

అందఱు: అమ్మా! మేలు మేలు. నీ పాతివ్రత్య ధర్మమునకుఁ జాల సంతసించితిమి.

ద్రౌప : ఓ మహాజనులారా! నేను దుర్యోధనుని గృహంబున సమస్త సేవను జేయుటకు హృదయపూర్వకముగా నంగీకరించితినిగాని దయయుంచి యితనికి నే నెట్లు దాసినైతినో తెలుపవేఁడెద,

దుర్యో: నేనే తెల్పెద వినుము. ధర్మజుఁడు సామ్రాజ్యమంతయు నోడి నల్వుర తమ్ముల నోడి తనోడి నిన్నోడెను. కాన నీవు మాకు దాసివైతివి.

ద్రౌప : మొదట తనోడి పిమ్మట నన్నోడెనంటివిగదా; యైన నన్నేల దాసివని పిలిచెదవు? ఈ మహాసభలో సమస్త ధర్మాధర్మవేత్త లగు పెద్దలెల్లరను విచ్చేసియున్నవారు. ఈ కృత్యము న్యాయము ననుసరించియున్నదా? ఇందు ధర్మవ్యత్యాస మేమియునులేదా? తాను పరాధీనుఁడైనప్పు డితరుల నోడుట కధికారముండునా? ఇది గ్రాహ్యమా? విశదీకరింప వేఁడుచున్నదానను.

అందఱు: (మౌనము ధరించి యూరకుందురు)

వికర్ణు : (లేచి) ఇది యేమన్యాయ మిది యేమన్యాయము:

చ. కలనయిన న్మహాత్ములను • గాంచఁగబోని మహాపతివ్రతా
తిలకము, ధర్మదేవత, యు • ధిష్ఠిరురాణి, మహాత్మురాలు స
భ్యులు దయచేసి న్యాయపథ • మున్ వివరింపుఁడటన్న జేతులన్
నలుపుచు నూరకుండెదరు • న్యాయమె? ధర్మమె? యో సభాసదుల్.

కర్ణు : చాలుఁజాలు వికర్ణా : చాలుఁజాలు. ఊరకొనుము.

వికర్ణు : నేనేల యూరకుందును ? తనకు దెలిసినంతవఱ కన్యాయము జరుగుచుండ నుపేక్షింపక న్యాయమును విశదీకరింపవలయును. పెద్దల వాక్యములు నన్నూరకొననీయవు—కానిండు. మీరంద ఱెంత యుదాసీనత్వ మూనినను, నేనుమాత్ర మిట్టి సభలో నింతటి ఘోరము జరుగుచుండ సహింపఁజాలను. ద్రౌపది యే విధముచేతఁ జూచినను దుర్యోధనునకు దాసి కానేరదు. ఇది ముమ్మాటికి నిశ్చయము.

దుర్యో: ఓ బుద్ధిహీనుఁడా ! యెందులకు కానేరదురా ? నీవు చిన్నవాఁడ వయ్యుయు బెద్దలయెదుట సిగ్గులేక మాటలాడెదవా ?

వికర్ణు : సిగ్గెందులకు ? సిగ్గెందులకు ? నే నెవ్వరితోనైన జూదమాడితినా: నే నెవ్వరినైన మసిబూసి మారేడుగాయఁజేసి యోడించితినా ; నేను నిష్కపటులై ధర్మస్వరూపులైన యన్నదమ్ముల కపకారముఁ గావించితినా ; లేక యితరుల యున్నతస్థితిఁజూచి యోర్వలేక పోయితినా : నేను—

దుర్యో: ఓరీ నీచుఁడా ! దాసియని చెప్పవేమిరా !

విక ! ద్రౌపది పాండవుల కేవురకు భార్యయా ; యొకనికి భార్యయా?

దుర్యో: అవు నేవురకును.

వికర్ణు : ఏవురికేయైన నొక్కఁడెట్లు పందెముబెట్టుట కధికారియగును ?

దుర్యో: కాదుకాదు. నేను మఱచితి నిదియొక్క యర్జునకే.

వికర్ణు : అవు నర్జునునకేగదా !

దుర్యో: అవు నర్జునునకే.

వికర్ణు : అయిన నర్జునునిభార్య నోడుటకు ధర్మరా జెట్లధికారియగును ? ఎవడైన వీధిలో జూదమాడుచు నీ రాజ్యము పందెముబెట్టి యోడి పోయిన నీ వొప్పుకొందువా ?

దుర్యో : ఇదియు నొక ప్రశ్నయేనా ? పాండవులేవురును సమభావంబున వర్తింతురు. కావున నర్జునుని సొమ్ము ధర్మరాజు సొమ్మే.

వికర్ణు : ఇది తలక్రిందుమాట. వస్తువాహనాదులయందట్లు చెల్లిన జెల్లును గాక; మానాభిమానములుగల వ్యక్తి విషయమున నట్లు చెల్లదు. ఇదియుఁగాక తమ్మునిభార్య పుత్రితో సమానము. పుత్రిపై నల్లునకుతప్పఁ దండ్రి కధికారములేదు.

దుర్యో : ఈవేఁట చాటున జరిగినదికాదు. చతురంగమను మహారణ్యముననే జరిగినది.

వికర్ణు : నీవు చతురంగమను నరణ్యంబుననే నీ శౌర్యమంతయుఁ జూపితివి. మహావిజయమును బొందితినని సంతోషింపుచుంటివి.

దుర్యో : చిన్నవాండ్రతో మేము మాటాడము. అట్లు మాటాడిన మా పెద్దతనమునకు లోపమువచ్చును. చాలుఁజాలు వికర్ణా ! నీవు మాకు నేఁటినుండి శత్రుసమానుఁడవు.

వికర్ణు : శత్రుఁడనైనను భయములేదు. నీ బెదరింపులకు బెదరువాఁడను గాను. నీ క్రోధవాక్యములకు భీతికిఁజెంది సత్యమార్గమునుండి వెనుకంజ వేయువాఁడనుగాను. నీ యిచ్చకముల కాసించి సాధుసజ్జనులకు ద్రోహ మొనర్చువాఁడను గాను. నేనొక్క భగవానునికిఁ దప్ప నింకెవ్వరికిని భయపడువాఁడను గాను.

దుర్యో : అయిన నీవు చచ్చుటయే వాస్తవమ్ము. ఎవరినైన సాయముఁ దెచ్చుకొమ్ము. (అని భీష్మాదులం జులుచుటం జూచును)

వికర్ణు : నేను జచ్చినను మంచిదే కాని నీవు మాత్రము బాగుపడవు హాహాహాహాహా ! ఎంత సాహసమునకు దొరకొంటివి : ఛీఛీ, నీ జన్మముగూడ నొక్క జన్మమేనా ! అయ్యయ్యో !

గీ॥ పాలవెల్లివంటి ♦ భరతవంశంబునఁ
బుట్టి యందె చిచ్చు ♦ బెట్టి తీవు
తరులయందుఁబుట్టి ♦ తరులనే దహియించు
నట్టిదావవహ్ని ♦ యనువుదోఁప.

దుర్యో: సరే, ఇప్పుడు నాపైఁ గత్తిగట్టి ద్రౌపది కేమిసాయముఁ జేయుదువో చేయుము. చూచెదఁగాక !

వికర్ణు: తుచ్ఛమగు మనుష్యులసాయ మాయమ కక్కఱయేలేదు.

క. స్ఫూర్తిని గర్తయు భర్తయు
హర్తయునౌ శౌరి యామ ♦ హాసాధ్వికి సం
పూర్తిసహాయతఁ జేయఁడె
నేర్తువె తత్కరుణజెంద ♦ నీవు దురాత్మా !

ఆయనయే యిప్పు డిప్పతివ్రతాతిలకమునకు రక్షకుఁడై యున్నాడు.

దుర్యో: దుశ్శాసనా! ఆరక్షకత్వ మెట్టిదియో కనుఁగొనియే తీరవలయును. ముందు చీరె విడువుము. (దుశ్శా—చీరను లాగును.)

ద్రౌప: (దుఃఖించుచు) ఓయీ దుర్యోధనా ! ఇదియేమి అన్యాయము ? నీవు మనుష్యుఁడవుగావా ? నీకు మానాభిమానములు లేవా ? ఒకవేళ నేను దాసినైనను, దాసికిమాత్రము మానభంగముఁ జేయ వచ్చునా ? నీకును నావంటి తోఁబుట్టు వున్నదికదా ! కటకటా ! నా విన్నప మాలింపుము. నేను నేఁటినుండి నీ భార్యకు సమస్త విధంబుల దాస్యముఁ జేయుదును. నాచీరెను విడిపింపకుము.

దుర్యో: ఓసీబంధకీ! చీర విడిపించినను, రవిక విడిపించినను అంతయు మాదయతో నున్నది. జూదములో గెల్వఁబడినసొమ్ము నెట్లు చేసికొనినను మాకు స్వాతంత్ర్యమున్నది.

ద్రౌప: (దుఃఖముతో) హా పరమాత్మ ! మురారీ ! దీనబంధూ ! దయా సముద్రా! గోవింధా! భక్తప్రియా ! వైకుంఠవాసా ! రక్షింపుము.

గీ. అక్కటక్కట దుర్యోధ ♦ నాది దుష్టు
లెంచి మదమున నన్వెంబ ♦ డించినారు
అతిభయంకరరావము ♦ లడరుచుండ
సింగ మావును ముట్టడిం ♦ చిన విధమున.

దుశ్శా: ఓసీ! ప్రభువుగారి యాజ్ఞయైనది. చీర విడువుము. (చీరలాగును)

ద్రౌప : ఓరీ ! నీకేమి పోవుకాలము వచ్చినదిరా ! అబల మానంబు దీయుట యొక పౌరుషమంటరా ? ఓరీ కుమతీ ! ఓరీ దురాచారా! నా మాట వినుము. నాపైఁ జేయివైవకుము. నీ వంశము నిర్వంశము కాఁగలదు. (అని ఘోరముగ దుఃఖించుచు నొకచేతఁ జీరఁబట్టుకొని యొకచేయిఁ బయికెత్తి) ఓ అనంతా ! ఓ గరుడ వాహనా ! ఓ కౌస్తుభభూషణా ! ఓ కమలదళ విశాలలోచనా ! యింత నిర్దయ తగునా ? రక్షింపుము. రక్షింపుము.

దుర్యో: దుశ్శాసనా ! నీకు నేఁడింత కనికర మెక్కడనుండి వచ్చినది. చూచెదవేల ?

ద్రౌప : స్వామీ ! చరాచర మూలకారణ : ఆశ్రిత పక్షపాతా ! నిఖిల కల్యాణ గుణగణసమేతా ! ఆదినారాయణా ! అనంతా ! అచ్యుతా! ఆదిపురుషా ! అవ్యయానందా ! హరీ ! గోవింద ! గోవింద ! యింత నిర్దయతగునా ? నీకు నే నొనర్చిన దోసమేమి ? నేను గావించిన ఘోరపాపమేమి ! నే నాచరించిన మహాపచారమేమి ? అయ్యో ! నా మొర నీవే యాలింపనిచో నింక దిక్కెవ్వరు ? నా తండ్రీ ! నా మ్రొక్కును, నా దిక్కును నీవేయని సర్వకాల సర్వావస్థలయందును నమ్మినదానిపై నింత యుపేక్షయుచితమా? చెల్లెలిని నిండుకొల్వులోఁ బరాభవింపనుండ నూరక మౌనముద్ర వహించుట నీకుఁగావున సరిపోయినది గాని యింకెవ్వరికిని జెల్లదు. హా ! అనాధనాథా ! ఆపన్నరక్షకా !

సీ. సకలేశ, దీనర ♦ క్షక, లోకనాయక,
  యవ్యయానంద సిం ♦ హాసనస్థ
పద్మలోచన, పాప ♦ భంజన, భవబంధ
  మోచన, మురహర ♦ పుణ్యపురుష,
గరుడవాహన, గోపి ♦ కా మనోహర, రుక్మి
  ణీవర, మహనీయ ♦ దేవదేవ,
బృందావనవిహార ♦ కుందమందారహా
  సా, మహాత్మా, యదు ♦ సంప్రదాయ

గీ. కనకవసన, శుభాంగ లో ♦ కత్రయ పరి
పాలనసమర్ధ, కల్యాణ ♦ శీల, యెట్టు
లరసిచూచిన దిక్కులే ♦ దయ్య నీవె
గాచినను గావకున్న నన్ ♦ గన్నతండ్రి !

నిన్నెంతని కొనియాడుదు. నీ మహిమ మెంతవారికినిగూడ నగమ్యగోచరముగదా ! (ధ్యానించుచుండును.)

దుశ్శా: ఓసీ ! యీటక్కులు చాలించు. మర్యాదగా నెంతచూచినను నీవు వినునట్లులేదు. (అని బలాత్కారముగ చీరనులాగుచుండును.)

ద్రౌప: రమ్మ రమ్మ. ఓ అంతర్యామి : ఓ గరుడవాహనా : రమ్మ రమ్మ. ద్వారకానగరమును నిర్మించితివి. గోపికల మానంబు రక్షించితివి. హింసాపరుఁడైన కంసుని వధించితివి. సాధు శేఖరుఁడగు వసుదేవుని చెఱవిడిపించితివి. ఆ మహాకార్యముల కన్న నిది యంతభారమా ? ఆ సంకటములకన్న నిప్పుడు నా కష్టముల దొలఁగించుట యంత యెక్కువైనదియా ? ఆకాశము నుండి నన్నుఁ బడద్రోయకుము. రమ్మ రమ్మ. నాచీరెను విడచినదాఁక నుపేక్షింపకుము. నాప్రాణవాయువు లంతరిక్షంబున కెగిరిపోవు వఱకు మౌనముద్ర వహింపకుము. అయ్యయ్యో ! యెంత ప్రార్థించిన నంత యుపేక్ష యుదయించె నిది యేమి పాపము !

సీ. అల యదితి స్తన్య ♦ మానుటచే దేవ
తలకు సౌఖ్యంబును ♦ దార్చితీవు
అల కోసలాధినా ♦ ధాత్మజపాల్గొ
కతమున మునులను ♦ గాచితీవు
అల దేవకీ స్తన్య ♦ మానుటచే గోప
కులముఁ బావనముగా ♦ సలిపితీవు
అల యశోదా స్తన్య ♦ మానుటచేత న
క్రూరునకు శుభంబు ♦ గూర్చితీవు

గీ. కానిపూతన పాల్దాగ్రావు ♦ కతననేమొ
నన్నునింతచిక్కువెట్ట ♦ బన్నినాఁడ
వీవె యిటుసేయ నాకు ది ♦ క్కెవ్వరింక
భవ్యకరుణానుభావ ! గో ♦ పాలదేవ !

తండ్రీ! మానభంగముఁ జేయుటకన్న నన్ను నశింపఁజేయుము. ఈరంగస్థలమునే రుద్రభూమినిఁ జేయుము. ఈవస్త్రమునే ప్రేత వస్త్రమును జేయుము. ఈభాష్పమునే కర్మోదకమును జేయుము. స్వామీ! యెంతవేడినను నాపై నిసుమంతయైన జాలిఁబూనవైతివి గదా? హా ముకుందా! హా గోవిందా! హా అశరణశరణ్యా ! హా అవ్యయానంద సామ్రాజ్యసింహాసనాధీశ్వరా ! హా భక్తవత్సలా! హా ఆపన్నివారకా: హా కృష్ణా! హా ద్వారకావాసా! యెందుంటివి?

శా. శ్రీకాంతా ! యని వేఁడగా గజపతిన్ ♦ జేపట్టగా నేగితో ?
లోకేశా యని వేఁడగా దనుజబా ♦ లున్బ్రోవ విచ్చేసితో ?
కాకుత్స్థా ! యని వేఁడఁగా మునితతి ♦ న్గావన్వనిం జేరితో ?
హా కృష్ణా! యదునందనా ! యిచట లే ♦ వా ? ద్వారకానాయకా!

దుర్యో: ఓసీ ద్రౌపదీ ! యీ వెఱ్ఱిగోలయేల? నా మాటవింటివేని—

కర్ణు : ఓసీ ! పాంచాలీ : పరమదరిద్రులగు పతులేవురైననేమి ? పదుగురైననేమి ? మహారాజాధి రాజగు దుర్యోధనుఁ డొక్కఁడు చాలఁడా సుఖపడుటకు ?

అర్జు : (లేచి యట్టహాసము చేయుచు) ఓరోరీ ! గర్వోన్మత్త చిత్త ! యేమంటివిరా? (సభదిక్కై) మహాత్ములగు నో సభాసదులారా ! నా ప్రతిజ్ఞ నాకర్ణింపుఁడు—

ఉ. అర్ణవసప్త కావృతధ ♦ రాధిపుఁడౌ యమపుత్త్రురాణినిన్
గర్ణకఠోరవాక్యముల ♦ గర్వము కన్నులుఁగప్పఁ బల్కునీ
దుర్ణయపూరపూరితమ ♦ దున్ఖలు నీచుని సూతపుత్రునిన్
గర్ణునిగోసెదంగలనఁ ♦ గాకులునక్కలు మూఁగియాడఁగన్.

అందరు: (భయమభినయింతురు.)

దుర్యో: (తన తొడ నెక్కుమనియుఁ, దన్ను గౌఁగిలించుకొనుమనియు ద్రౌపదికి సన్న జేయును.)

భీము: (మహోగ్రుఁడై లేచి గద సారించుచు) ఓరీ చండాలా! ఓరీ పరమపాతకీ!

చ. పడఁతిని సత్పతివ్రతను ♦ భవ్యచరిత్రను నిండుకొల్వునన్
గడుకొనియీడ్చి తెచ్చి యను ♦ కంపవహింపక కట్టుపుట్టమున్
విడువ ననుజ్ఞనిచ్చి యవి ♦ నీతిఁదొడన్ వసియింపుమన్న యో
వెడఁగ! దురాత్మ! నీతొడలు ♦ భీమగదన్ బొడియైపడుంజుమీ!

(సభదిక్కయి) కురువృద్ధులారా! గురువృద్ధులారా! వినుచుంటిరా! యీమూఢదుర్యోధనుఁడు—కాదుకా దీమహారాజ దుర్యోధనుఁడు తన తొడ నెక్కుమనియుఁ, దన్నాలింగనము గావింపుమనియుఁ, బతివ్రతాశిరోమణికి సన్నచేయుట మీరెల్లరుఁ జూచుచునేయున్నారు. కావునమహారాజుగారికోర్కి యెన్నఁడును వ్యర్థము కాఁగూడదు. కాన,

గీ. అశనిసంకాశమైనట్టి ♦ యుస్మదీయ
ముష్టిఘొమ్ము నాలింగన ♦ ముం బొనర్చు
వీర శత్రుంజయంబని ♦ పేరుగొన్న
యీగదాదండ మంకము ♦ నెక్కుఁగాక!

ఇట్లు సేయనేని మాతాపితలగతికిం దప్పినవాఁడనగుదును.

దుర్యో: చూచెదనులే. (దుశ్శాసనునితో) తమ్ముఁడా! యెన్నిమారులు చెప్పిన నూరక చూచెదవేమి! చీరెను లాగుము.

దుశ్శా: (ద్రౌపదితో) ఏమే! పెనఁగులాడెదవు. (అని జల్మని జీరె విప్పఁబూనును.)

ద్రౌప : (తొలఁగిపోఁబోవును.)

దుర్యో: దుశ్శాసనా! ఆ బంధకి యెక్కడికో పోఁబోవుచున్నది. కొప్పుఁ బట్టుకొని యీడ్చి మరి చీరెవిడుము. (దుశ్శాసనుఁడట్లుచేయును)

భీము: (క్రోధముతో రోజుచు) ఓరీ దుశ్శాసనా !

చ. స్థిరముగ యజ్ఞమంత్రముల • చేతఁ బవిత్రములైనయట్టి పె
న్నెరులనుబట్టి యీడ్చి యతి • నిష్ఠురవాక్యము లాడుచున్ననిన్
గురుతరవక్షము న్బగులఁ • గొట్టి వధించెద రక్తధార నీ
సరసిజనేత్ర వెండ్రుకల • జక్కఁగఁబూయుచుఁ జిక్కుఁదీసెదన్.

దుశ్శా: ఊఁ. అన్నియుఁ జేసితివిలే. నోరుమూసికొని చచ్చినట్లు పడి యుండుము. ఓసీ కులటా ! నీవేషములు నాచెంత సాగిరావు. చీర విడిచెదవా? లేదా? (బలాత్కారముగఁ గొంతవఱకు లాగును.)

ద్రౌప: (ధ్యానము నటించి) అనాథరక్షకా ! ఆశ్రితవాత్సల్య జలధీ : అశరణశరణ్యా ! హా కృష్ణా ! ద్వారకావాసా! యెచ్చటనుంటివి ? యేమి చేయుచుంటివి ? ఇట్టి మహావస్థయందు నీవుతక్క నింకెవ్వరుదిక్కు? రక్షింపుము, రక్షింపుము. ఒకహస్తము పైకెత్తి ప్రార్థించుచున్నను, " దేహాభిమానము వదలక, స్వాతంత్ర్య మవలంబించి రెండవహస్తమున మానసంరక్షణ మొనర్చుకొను చుంటిని. ఇంక నాతోనేమిపని " యని యుపేక్షించితివాయేమి ? కోపించితిహాయేమి ? ఇదిగో దేహాభిమానమును విసర్జించుచున్న దానను, ఇదిగో స్వాతంత్ర్యమును బోగొట్టుకొనుచున్నదానను, ఇదిగో సర్వధర్మములను బరిత్యజించుచున్నదానను. నిన్నొక్క నినేనమ్మి నీపాదారవిందములే హృదయంబునం బదిలపరచి నీ నామామృతమునేక్రోలుచు నిన్నే శరణుబొందుచున్నదానను. ఇంక నన్నెట్లుచేసినను నీదియే భారము. నీయిష్టమువచ్చినట్లుచేయుము. నీచిత్తమునకు వచ్చినరీతిఁ గావింపుము.

మ. సరసీజేక్షణ! రుక్మిణీవర! హరే! ♦ సర్వేశ్వర! శ్యామసుం
దర! వేదాంతవిహార! సంతతమునీం ♦ ద్రధ్యేయ! దీనావనా
దర! దామోదర! పాపదూర! పరమా ♦ త్మన్ పాహిమామన్యథా
శరణం నాస్తి మమ త్వమేవ శరణం ♦ స్వామిన్! కృపాంభోనిధే!

(అని రెండుచేతులం బైకెత్తి జోడించి ధ్యానము గావించును.)

దుశ్శా: (చీర నొలిచి యింకొకచీర యుండుటంగని) ఈ గయ్యాళి యేక వస్త్రనని చెప్పి రెండు వస్త్రములు గట్టుకొనియున్నది. (మరల విప్పి) యింకనొకటియున్నదే! (అని చీర నొలిచిన నింకొకటి యుండుటంగని పెక్కుచీరలను విప్పి) నాచేతులు పడుచున్నవి. ఈకులట యెన్ని చీరలఁ గట్టుకొనియున్నది! అబ్బా! (అని చతికిలఁబడును.)

అందరు: ఆహా! ద్రౌపదీదేవి పతివ్రతాధర్మము! భగవంతుని యనుగ్రహము పూర్ణముగా లభించినది. ధర్మము జయించినది. సత్యము నిలిచినది.

కర్ణు: ఆహా: దుశ్శాసనా! నివ్వెరపాటు జెందెదవేల? నీపని నీవు తీర్చితివి. సేవకా! నీవీచీరెలన్నియుఁ గొనిపోయి రాణీవాసమునకు సమర్పింపుము.

ధృత: (ఉలిక్కిపడి) ఇదియేమి దుర్యోధనా! యిటురమ్మ: నీకిది మంచిదికాదు. తల్లీ! ద్రౌపదీ! నీ కారణంబున మావంశము పవిత్రమయ్యె! మూఢులై నీ కపకృతినొనర్చిన నా కుమారుల క్షమింపుము. నీమహిమము మెచ్చితి. ఏదియేని వరంబుగోరుము.

ద్రౌప: మామా! నాయందు దయగల్గి వరంబిచ్చెదనంటిరి. కావున నానాథుల చెఱనుండి విడిపింపుడు.

ధృత: అట్లే. ఇంకొకటి కోరుము.

ద్రౌప: నానాథుల శాస్త్రాస్త్రంబుల నిండు.

ధృత: మంచిది! ఇంకొకటి కోరుము.

ద్రౌప: క్షత్రియకన్యల కింతయే యధికారముగలదు.

ధృత : మంచిది. నీ భర్తలను సమస్తసామ్రాజ్యముతో విముక్తులను గావించితిని.

దుర్యో: (అప) మామా! మాతండ్రి మన ప్రయత్నమంతయు వ్యర్థముఁ జేసెనుగదా ? నేనేమిసేయుదు ?

శకు : (అప) ఇంకను మించినదిలేదు. మరల జూదమనియే రప్పించి యప్పుడు పండ్రెండు సంవత్సరము లరణ్యావాసంబును, ఒక సంవత్సర మజ్ఞాతవాసంబును జేయునట్లునిబంధనమేర్పఱచుదము. దీనింగూర్చి యేకాంతముగ విచారింతము. (దుష్టచతుష్టయము నిష్క్రమించును.)

ద్రౌప: మామగారూ ! యింక మాకు సెలవిండు !

ధృత : మంచిది. (పంచపాండవులును, ద్రౌపదియు నిష్క్రమింతురు.)

భీష్మ, ద్రోణ: మేమును బోయెదము. (నిష్క్రమింతురు.)

ధృత : చిత్తము. విదురా ! నన్ను లోనికిం గొంపొమ్ము. (అని యందఱును నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

# కురుక్షేత్రము

## [ అను సంపూర్ణ మహాభారతం ]

## తృతీయాంకము

ప్రథమ రంగము - ఆరణ్యము

( తర్వాత రుక్మిణీ సత్యభామలు ప్రవేశింతురు )

సత్య : అక్కా ! నీకుఁ దప్పని దోఁపకున్న ద్రౌపదిని మందడిగెదను.

రుక్మిణి: మందా ? మందా ? నీకంత గొప్పరోగ మేమివచ్చినది ?

సత్య : ( అనుమానముతో ) ఏమియులేదు.

రుక్మిణి: అదిగో : అనుమానించుచుంటివి. సంగతియేమో చెప్పుము.

సత్య : నీ చక్కదనమును జూచి నా నాథుఁడు నా యెడ ననుగ్రహముఁ దప్పి నీయందు దయగల్గి యున్నవాఁడు. అయ్యయ్యో !

మ. అనుకూలంబుగఁ గాలమున్ గడపుచున్ ♦ హాళిన్ విడంబించుచున్
నను నెక్కాలము ప్రేమఁజూచుచు మహా ♦ నందంబు సంధించుచున్
మనమందేదియు నన్యకాంతల స్మరిం ♦ పంబోని నాథుండు నే
ననినంతం గడురోయుచుండ నెటులీ ♦ ప్రాణంబుల న్నిల్పుదున్

రుక్మిణి: ఆహా ! చెల్లెలా ! నే ననఁదగినమాటయే నీ వంటివి. ఎవ్వరి జోలికిని బోవక యే ముచ్చటయు నంటించుకొనక యెట్లో కాలము గడుపుచున్నను, నన్నుఁజూచి నీ కన్ను లోర్వకున్న విదియేమీ పాపము !

సత్య :(కోపముతో) నా కన్నులా ! నా కన్నులా ! నారాయణ ! అను కొనుము.

రుక్మిణి: ఆహా ! చెల్లెలా ! మాటిమాటికిఁ గోపముఁ దెచ్చుకొనెదవేమి ?

సత్య : అవునవును! నిన్ననుట పొరపాటే. క్షమింపుము; శ్రీకృష్ణుని నా నాధుని బహిఃప్రాణమవగు నీవనినతోడనే మహాప్రభ్వియనె. నింక నేను ధన్యురాల నైతినిగదా యని సంతసింపవచ్చినప్పుడు కోపమా?

రుక్మిణి: ఇవియన్నియు నేర్పుమాటలు, నాకు రేయుఁబవళ్లును సమానమే. దినములు, వారములు, నెలలు, సంవత్సరములు నా నాధుని దర్శనము గల్గకపోయినను వచ్చిననాఁడే నా యాశయంతయుఁ బండెఁగదాయని యుప్పొంగుచుండ నిటువచ్చు నటుపోవును. నిముషమైన నుండఁడు. పోనీ, నేనైననేమి, నా చెల్లెండ్రైననేమి సుఖించినఁ జాలుగదా యని సంతసించుచుందును.

సత్య : మంచిది. మఁచిది. నీ వెప్పుడు నిష్ఠేపల్కుచుందువు. మాయలు పన్నుటలో నీవంటివా రింకొకరు లేరు.

రుక్మిణి: (శాంతించి) నీ కేమిలోపము గల్గుచున్నదో చెప్పుము?

సత్య : నేను నీవలె నా గృహంబునకు రాఁడని చెప్పను. ఆ వచ్చిన నిముసమైప నీమీఁది ధ్యానమే. ఒక్కరెప్పపాటైన నుండునో, యుండఁడో, మీఁది యుత్తరీయముగూడఁ దీయకయేపోవును.

రుక్మిణి: అవును. లోకులెల్ల సహజముగ నిట్లే తలంతురు.

సత్య : నీవేమైన ననుకొమ్ము. నిశ్చయముగా నీ మోహామను వలలోఁ జిక్కి నా ప్రాణేశ్వరుఁడు నన్నుఁ గన్నెత్తియైనఁ జూచుటలేదు. జడముట్టి బాసచేసెద. నమ్ముము. ఇందుచే నీకు నేను భయపడు చుంటిఁ గావున ద్రౌపది నుపాయ మడిగెద.

ద్రౌప : (ప్రవే)

రుక్మిణి: అమ్మా! ద్రౌపదీ! కూర్చుండుము.

సత్య : ఓహో! శక్తిలేని రోగిదగ్గరకు వైద్యుఁడే వచ్చినాఁ డెంత యదృష్ట మెంతయదృష్టము!

ద్రౌప : ఆహా! అనవసరంబుగ స్తోత్రమను వంతెన కట్టఁబడుచున్నది.

సత్య : అమ్మా ద్రౌపదీ! నానాధుఁడు రుక్మిణిమీఁది ప్రేమచే నాయందు దయదప్పె. దీని కుపాయమున్నఁ జెప్పుము.

ద్రౌప: ఇయ్యది లోకసామాన్యముగా నెల్లరికున్న దేగాని, పతితో ననుకూలముగ మాటలాడుట, పతి సుఖదుఃఖములలోఁబాల్గొనుట మున్నగు పతివ్రతాలక్షణములే దీని కుపాయము.

సీ. పతి యెంతటి కురూప ♦ వంతుఁడై యుండిన
నతనిసేవయె మహా ♦ వ్రత మటంచుఁ
బతి యెంతటి మహావి ♦ పద్దశనుండినఁ
బరికించి యతఁడె దై ♦ వంబటంచు
బతి యెంతటి దరిద్ర భావంబునందున్నఁ
బృథివి నాతఁడె పెద్ద ♦ నిథి యటంచుఁ
బతి యెంతటి కఠోర ♦ వాక్యములాడిన
మనముల వాని దీ ♦ వన లటంచుఁ

గీ. బతికి సేవలఁజేయుచుఁ ♦ బతియనుజ్ఞ
మీఱకెంతయుఁ బతికి న ♦ మేయసుఖము
గలగఁజేయుచునుండు నే ♦ పొలఁతి యట్టి
సతియె క్షితితలమునఁ బతి ♦ వ్రత యనఁబడు.

రుక్మి : సత్యకిదియే తప్పక బోధింపవలయు. ఇది యీమెకుఁ జాల యవసరము.

సత్య : యెందుల కెకసక్కెములాడెద వింకఁజూడుము. నానాధు నెట్లు లోఁబఱచుకొందునో ?

రుక్మి : అయినచో నీచెంతవచ్చియైనఁ దొంగిచూడను. నాప్రాణేశ్వరు నొక పలుకైనఁ బలుకను. నావిధినిగూర్చి దూరెదను. నిష్కారణముగా నాపై నెపముఁ బెట్టెదవు. నిజమాడిన నిష్ఠురముగాని యొక్కసారి ప్రాణనాధుని శాల్వకున్న యుత్తరు వెవ్వరిదో చూడవలయును. ఎవ్వరుప్రాణనాయకుని వెంద్రుకలు చిక్కుదీసి

సంపెంగనూనెతో నూరుమారులు దువ్వెదరో, ఎవ్వరు దినము నకు వేయివేసములను వేయుదురో, ఎవ్వరు లెక్కకు మిక్కుటంబుగ మల్లెపూవులం దాల్చి కుల్కుచు నాయంత సౌందర్యవతి లేదని విఱ్ఱవీగుచుందురో, యెవ్వరు ప్రాణేశ్వరునిఁ దన కొంగున ముడివైచుకొని యుండిరో, ఆ మహాభాగ్యవతి ; ఆ మహారాజ్ఞి ; యా త్రిలోకసుందరి నీవేకదా ! ఇదియునుంగాక.

సీ. శ్రీమించు బంగారు ♦ మామిడిపూవుల
చే నొప్పు చెంగావి ♦ చీరెఁగట్టి
చలువజేసి వరాల ♦ తళుకుకోరునవేయ
హవణించుముత్యాల ♦ రవికెదొడఁగి
గుండ్రనై చంద్రున ♦ కు న్వెనుదీయుని
మోమునఁగస్తురి ♦ బొట్టుదిద్ది
యనుపమకాంతి స ♦ మంచితమై మనో
హరమైన యాభర ♦ ణాళిఁదాల్చి

గీ. సారెసారెకుఁ జెలులు ల ♦ క్షలును గొల్లు
వచ్చి యడుగులొత్తంగ నీ ♦ వఱెనె నేను
గూడ నెప్పుడు రతనాల ♦ మేడలందు
హాయిగానున్న నన్నిట్టు ♦ లందునొక్క.

సత్య : ఇవి నేర్పుమాటలు. నేను బట్టమహిషినిగాలేదు, అక్కా ! నన్నింక నీ దాసినిగాఁ జేర్చుకొనుము. నీ యొద్ద దాస్యముఁ జేయుచునైనఁ బ్రాణేశ్వరుని సందర్శింతును.

ద్రౌప : మీరెప్పు డీట్లే నాదులాడుచుందురు. మా యన్న శ్రీకృష్ణుఁడీ వీతెఱంగియే మీ వివాదము మితిలేని ప్రసాదమని తలంతును. ఒక్క నిముషము విడిచియుండుట సంవత్సరముగా నెంచును.

రుక్మిణి: అవును. మీ యన్నగా రతిచమత్కారప్రియులుగదా ?

సత్య : (నవ్వుచు) ఇద్దరు కోప మొందకుండునట్లును, ఇద్దఱి మనస్సులు నొవ్వకుండునట్లును, సంతోషపెట్టుటలో మీ యన్నగారికున్న ప్రయోజకత్వ మింకొకరికిలేదు. అమా! (కన్నుల నీరు బెట్టుకొని) మిమ్మింక మరల నెన్నాళ్ళకుఁ జూతుమో? రత్నసౌధాంతరాళముల విహరింపవలసిన మీకు దుర్విధిచే నీ యరణ్యవాసము సంప్రాప్తించెను. మీ రిక్కట్టు లన్నియుం గడచి యీశ్వరానుగ్రహంబుఁ దిరిగి సమస్త సౌఖ్యము లనుభవింతురు. మీకు శుభమగుగాక!

ద్రౌప : ఏమీ! మీరీనాఁడే ద్వారకకే గెదరా?

సత్య : మీ యన్నగారియాజ్ఞ దాఁటఁగూడదుకదా?

ద్రౌప : అట్లున నింక రెండుదినములుండ నన్నగారిని వేఁడెద రండు.

(అందరు నిష్క్రమింతురు)

రంగము—హస్తినాపురిలోని వీథి

[ తర్వాత సాధువు, నగరవాసియుఁ బ్రవేశింతురు ]

సాధు : ఈ నగరంబున నందుఁడను పేరుగలవా రున్నాఁడా?

నగ : ఆఁ యున్నాఁడు. ఆయన యెప్పుడును మీవంటి సాధువులఁ బూజించుచుండును. అందుచే దిగంత విశ్రాంతమైన విఖ్యాతిని సంపాదించెను.

సాధు : వారి గృహమెక్కడ?

నగ : ఈ సమీపముననే యున్నది. కాని యిప్పుడాయన రారాజు దుర్యోధనుని సేవఁ జేయఁబోవును. ఆయనతో మీ కేమిపని యున్నది?

సాధు : ఏమి పనియా! సాధువులకు గృహస్థులతో నేమిపనియుండును? ఏవిధమైనఁ గొన్ని మంచిమాటలఁజెప్పి కడుపు నింపుకొనుటయే గదా?

నగ : అందులకేయైన దుర్యోధనుఁడుగూడ భిక్ష నొసంగును. అతని చెంతకే యేగుఁడు.

సాధు : అయ్యో : దుర్యోధనునిచెంతకా ? నారాయణ ! నారాయణ :

నగ : అయ్యో ! అట్లనెదరేమి ?

సాధు : నాయనా : అట్టిభిక్ష కుక్కలకును, దోడేళ్ళకును యోగ్యమైనది. ఇట్టి భిక్షవలన సాధు లెప్పుడును తృప్తిఁజెందరు. అన్యాయము వలన సంభవించిన యన్నము బుద్ధిని బోఁగొట్టును. నందుఁ డొక కిరాతుఁడైన నాయన శరీరమంతటను హరిభక్తి ప్రాకియున్నది.

నగ : చిత్తము. (ముందుజూచి) ఇదిగో: నందుఁడిటే వచ్చుచున్నాఁడు.

నందు : రాధాకృష్ణ : రాధాకృష్ణ : (అనుచుఁ బ్రవేశించును.)

నగ : ఓ నందభక్తుఁడా :

నందు : మహారాజా : యజమానునకు క్షేమమగుఁగాక : రాధాకృష్ణ : రాధాకృష్ణ :

నగ : ఇదిగో సాధువు నిన్ను విచారించుచు విచారించుచు నిక్కడకు వచ్చినాఁడు. (నిష్క్రమించును.)

నందు : నన్నడుగుచునా మీరు వచ్చినది? అయ్యో: యెంత యపచారము గావించితిని. (సాష్టాంగ నమస్కారము చేయును.)

సాధు: కళ్యాణమగుఁగాక : దుస్సహవాసము, దుర్వర్తనము గలవారికి దూరముగా నుండువుగాక :

నందు: స్వామీ : నేను శూద్రుఁడ ; నేమియాజ్ఞ ?

సాధు : ఆజ్ఞయేమున్నది ? మేమర్థులము. భోజనము కావలయును.

నందు: అయ్యా: దయచేయుఁడు. భాగవతోత్తములారా: దయచేయుఁడు. ఈనీచునియింట భుజించి పవిత్రముచేయుఁడు.

సాధు : నీవెక్కడి కేఁగుచుంటివి? త్వరగా నీకార్యమును దీర్చికొనిరమ్ము.

నందు: ఓదయామయా : నేను దుర్యోధన మహారాజుగారి పాదసేవకు నిత్యమును బోవుచుందు. ఇపుడు కొంచె మాలసించి పోయెదను.

సాధు : అతఁడు కోపింపఁడుగదా ?
నందు : కోపించునుగాని నేను బ్రతిమాలెద,
సాధు : నిన్ను శ్రమపెట్టి మేము సుఖముగా భుజించుట మాకిష్టము లేదు. కావున నీ వేగుము. మే మెక్కడనైన భుజింతుము. దుర్యోధనుఁడు కఠినచిత్తుఁడు. నీపై నాగ్రహింపఁగలఁడు.
నందు : భయములేదు. భాగవతోత్తములారా : భయములేదు. ఆ మహా రాజున కాగ్రహము వచ్చినయెడల నేనీ లోకమందు సుఖపడను. గాని, మీకే యాగ్రహము వచ్చినచో నిహపరంబులకును జెడుదును. గావున మీ పాదసేవకన్న రాజసన్మాన మెక్కుడుగాదు.

గీ. సకలమంగళముల గూర్చు • సాధుసేవ
విడిచి యీ రాజసేవకై • మిడుకఁదగునె
కలుషములనెల్ల హరియించు • గంగయందు
స్నానమాడక కుంటకుఁ • జనినయట్లు.

సాధు : రాజతికోపియైనను నీవు భయపడలేదు. నీవు నిశ్చలమైన భక్తి గలవాఁడవు.
నందు : మహాత్మా : తుచ్ఛుఁడనైన నన్నడుగుచు మీరేవచ్చితిరి. ఇంత కన్న నాకుఁ గావలసినదేమి ? మీ చరణారవింద సందర్శనమున నఖండతపంబును జేసిన ఫలముగంటి. అట్టిదానిని విడిచిపోయి నచో నింక నా కన్న నభాగ్యులెవరు ? సమస్త క్షేత్రములును, సమస్తతీర్థములును మీవంటి సాధువులవెంటనేవచ్చు. ఇంతియగాక

మ. వసుధం జచ్చిన యట్టులుండు నరిష • డ్వర్గంబు సత్సాధు పా
దసరోజంబులక్రింద, మోక్షమును బొం • దన్ సాధనంబంచు శ్రీ
వసుదేవాత్మజుఁడైన సాధుపదముల్ • భక్తిన్ శిరంబందుఁ దా
ల్చి, సదాకన్నులనద్దుకొంచుఁ గడుఁబూ • జించున్, భజించున్మదిన్.

సాధు : ఓ భక్తాగ్రేసరుఁడా ! కృతార్థులమైతిమి. యోగుల కిట్టి భిక్షయే కావలయును. బొట్టుపెట్టినను మా కదియే షడ్రసోపేతభోజనము.
నందు : సేవకుని గృహమును బవిత్రముసేయుఁ (అని యిద్దఱు నిష్క్రమింతురు)

( రంగము—దుర్యోధనుని సౌధము ముందరి పెద్దవీధి )

శ్రీకృష్ణుఁడు: (నందవేషముధరించి ప్రవేశించి నడచుచు) ఓభక్తాగ్రేసరా! ఓనా ప్రియస్నేహితుఁడా! ఓనా మహారాజా! ఓ నందభక్తుఁడా! నీవు నిశ్చింతతో సాధువులకు భోజనముబెట్టుము. వారిసేవలందుఁ జొచ్చి బ్రహ్మానంద మనుభవింపుము. ఈ మూఢదుర్యోధనున కేమాత్రము భయపడకుము. నేను నీ భక్తికి మెచ్చితిని. నీవు మద్భక్తిపరవశుఁడవై సాధువులకు సేవఁజేయుచుండుటచే నే ననుమానింపక యీ రాజాధమునకు సేవఁజేయుటకుఁ గూడ సంసిద్ధుఁడనైతిని. ముందు నీ పనిఁ జూచియే పిమ్మట పాండవుల రాయబారము నడపెద. దుర్యోధనుఁడు కోపించి నిన్ను శ్రమ పెట్టకుండ నిదిగో నీ రూపమును ధరించి వాని కాళ్ళ నొత్తుటకుఁ బోవుచున్నాఁడను. నీవు కిరాతుఁడవని నా కభిమానములేదు. భక్తులకొఱ కెంతలెంతలు హీనవేషములైన వేసి యెంతలెంతలు హీనకారములైనఁ గావించెద. ఇది నా వ్రతము. ఇది నాభక్తులకు నే నొసంగిన యభయప్రదానము. ఇంక దుర్యోధనుని శయన మందిరమున కరిగెద. (పరిక్రమించును) (తెరయెత్తఁగ దుర్యోధనుఁడు నిద్రించుచున్నట్లు గన్పింపఁజూచి తనలో) ఆహా! నా భక్తులు నా పాదములకు శృంఖలములను దగిలించినారు. కావు ననే యెట్టి రూపములనైన ధరింపవలసి వచ్చుచున్నది. యెట్టి పనులకైనఁ బాల్పడవలసి వచ్చుచున్నది. ఎప్పుడును భక్త పరాధీనుఁడను గావున దేనికిని లజ్జింపవలసినపనిలేదు. ( మెల్లగ దుర్యోధనునకుఁ జమురంటును )

దుర్యో: (మేల్కాని) నందుఁడా! వచ్చితివా?

శ్రీకృ : (తనలో) ఇప్పుడితఁడీ వేషమువలన సంతోషించెను. భక్తుఁడా, నిర్భయుఁడై యుండెను. ఇతనికి కోపమురాలేదు. ఎట్లో భక్తున కాపద వాటిల్లకుండ రక్షింప వచ్చినందులకది సమకూరెను. కృతార్థుఁడనైతిని. (ప్రకాశముగా) మహారాజా! వచ్చితిని. (అని పాదములొత్తును)

దుర్యో: మంచిది. ఇంక నీవు పొమ్ము.

శ్రీకృ : చిత్తము. (నిష్క్ర)

దుర్యో: ఆహా : ఈ దినమున దలకు చమురంటినట్లు, ఈ దినమున బాదముల నొత్తినట్లు, నందుఁ డిదివఱ కెన్నఁడును జమురంట లేదు, పాదములొత్తలేదు. పాపము వీని కేదియైన పారితోషిక మొసంగవలయును.

నందు : (భయముతోఁ బ్రవేశించి) మహారాజా : అన్నదానపరాయణ : క్షమింపుము. ఈయొక్కమాఱు క్షమింపుము. ఇఁకముం దిట్టిపని నేనెన్నఁడును జేయను. నేను దండనమునకుఁ బాత్రుఁడను గావున క్షమించుము. (పాదములంబడును.)

దుర్యో: ఏమినందా : యేమి ?

నందు : నేను ప్రమాణముఁజేసి చెప్పుచున్నాను. నేనశ్రద్ధగా నుండలేదు. మీ సేవ మఱచిపోలేదు.

దుర్యో: అయిన ?

నందు : సాధుసేవలో నుంటిని.

దుర్యో: సాధుసేవలోనా ?

నందు : అవును. సాధుసేవలోనే. అందుచే నాలస్యమైనది.

దుర్యో: ఎవరి కాలస్యమైనది ?

నందు : నా కాలస్యమైనది.

దుర్యో: ఎందులకు ?

నందు : మీ సేవఁజేయవచ్చుటకు.

దుర్యో: ఏమి యరచెదవురా ?

నందు : నే ననృతమాడిన నా పూజ నిష్ఫలమగును.

దుర్యో: నీవున్మత్తుఁడవు కాలేదుకదా : యిప్పుడే నాపాదము లొత్తి నా శిరమునఁ దైలమంటి పోయితివి. నీకేమి వెఱ్ఱియెత్తినది ? వెంటనే తిరిగి వచ్చితివి.

నందు : కాదు మహారాజా : యొకసక్కెములాడెద రేమిచేయుదును.

దుర్యో: (కన్నుల నెఱ్ఱజేసి) ఏమిరా ?

నందు : చిత్తము. మహారాజా ! కోపమువీడుఁడు. ఈయొక్కమాఱు క్షమింపుఁడు.

దుర్యో: కాదుకాదు. నాశీర్షమింకను మెరుగుగానేయున్నది చూడుము.

నందు : (చూచి) ఈ సేవ నేనే చేసితినా ?

దుర్యో: నీవే.

నందు : ఈ దినముననేనా ?

దుర్యో: ఈ దినముననే.

నందు : ఇప్పుడేనా ?

దుర్యో: ఇప్పుడే.

నందు : పాదము లొత్తినదిగూడ నేనేనా ?

దుర్యో: అవును నీవే నీవే.

నందు : ఈరూపముతోడనేనా ?

దుర్యో: ఈరూపముతోఁగాక యింకేరూపముతో ?

నందు : ఇదేముఖమా ?

దుర్యో: ఇదే ముఖము. ఇదే రూపము, అన్నియు నివియే. ఊరక విసిగింపకుము.

నందు : (ఆశ్చర్య సంతోషములతో నవ్వుచు గంతులుపెట్టుచు) ధనము వెచ్చించి సాధువులకుఁ దృప్తిగా భోజనముఁ బెట్టవలయును !

దుర్యో: ఓరీ పిచ్చివాఁడ! యిందాశ్చర్య మేమున్నదిరా? అట్లు గంతులు పెట్టెదవు ?

నందు : మహారాజా ! మీరు మిక్కిలి యదృష్టవంతులు.

దుర్యో: నందా! నీకు నిజముగాఁ బిచ్చియే పట్టినది. (తెరవంకఁజూచి) ఎవరురా అచ్చట ?

సేవకు: మహారాజా ! యేమియాజ్ఞ ?

దుర్యో: నీవు చని కర్ణ, దుశ్శాసన శకునులఁ బిలుచుకొనిరమ్మ. నందు నకుఁ బిచ్చి యెత్తినదని చెప్పుము. త్వరగాఁబొమ్మ.

(సేవకుఁడు నిష్క్రమించును.)

నందు : స్వామీ! నీవుయోగివి. జితేంద్రియుఁడవు. మునివి. నీకు సాష్టాంగ నమస్కారము. (పాదములపై నొరగుచు) ఏపాదములకు సృష్టి స్థితిలయకారణభూతుఁడును, అవాఙ్మనసగోచరుఁడును, అఖిల కళ్యాణగుణగణరత్నాకరుఁడును, ఆశ్రితవాత్సల్య జలధియు నగు భగవానుని దివ్యహస్తములు స్పృశించు మహాభాగ్యము లభించెనో యామీపాదములధూళి నొక్కమారు నానేత్రములఁ దగులనిండు. ఆపాదముల నొక్కమారు శిరమునం దాల్పనిండు. (అని దుర్యోధనుని పాదముల నెత్తిపైఁబెట్టుకొని కన్నులనద్దుకొనును.)

దుర్యో: వీనికి నిశ్చయముగా నున్మాదమే సంభవించినది. కనుక వెంటనే వీనికి తగిన చికిత్సఁ చేయింపవలయును.

నందు : మహారాజా! మీకు బ్రహ్మాదులకును దుర్లభమగు శ్రీకృష్ణ భగవానుని సందర్శనము లభించినది.

దుర్యో: (కోపముతో) ఎవరి దర్శనము ? ఎవరి దర్శనము ?

నందు : సకల జగదంతర్యామియు భక్తిపరాధీనుఁడునైన శ్రీకృష్ణ పరమాత్మ సందర్శనమే.

దుర్యో: ఓరీ బుద్ధిహీనుఁడా ! యేమి యరచెదవురా ?

నందు : మహారాజా ! కోపింపవలదు. నేను సాధుసేవలో నుండఁగా నావేషముధరించి భగవానుఁడు రాధాకృష్ణుఁడు మీకు సేవజేసెను.

దుర్యో: కృష్ణుఁడా? కృష్ణుఁడా? ఓరిమూర్ఖుఁడా! కృష్ణుఁ డొకభగవానుఁడా?

నందు : మహారాజా! చిన్నతనంబుననే శకటాసురుఁడు, తృణావర్తుఁడు, ధేనుకాసురుఁడు మున్నగాగల యనేక దుష్టరాక్షసులను శిక్షించె. విషదుగ్ధములను గ్రోలి పూతన ప్రాణవాయువులం బీల్చె. కంసుని, బాణాసురుని, నరకాసురుని భంజించె; నప్పరమేశ్వరుఁడే యిప్పుడు తమచెంతకు విచ్చేసి సేవజేసెను.

దుర్యో: ఓరీ! కృష్ణుఁడు నాయనుజ్ఞలేక ఇక్కడి కెట్లువచ్చును ?

నందు : ఆ మహాత్ముని కొకరి యనుగ్రహముతో నేమి యవసరము. తన్మహిమ మచింత్యముగదా, ఆ పరమేశ్వరుఁ డొకచోటనుండి యేలరావలయును ? ఇచ్చటలేఁడా ?

దుర్యో: ఓరీ వ్యర్థప్రసంగముఁజేసిన నిన్నిప్పుడే ఖండించెద.

నందు : ఓ మహారాజా : నన్ను ఖండించుటకే నీవు సంకల్పించిసచో—

గీ. మదనమోహన మగు తన ♦ మహితదేహ
ము ను విడిచి నీచమైన రూ ♦ పును ధరించి
నిన్ను సేవించె నెవఁ డాప్ర ♦ సన్నమూర్తి
కరుణ వేంచేసి, యిపుడు న ♦ న్గావలేఁడె.

నాచిత్తంబెప్పుడును దత్పదాయత్తం బగునేని వేయేల గజేంద్రుని రక్షించినట్లును. ద్రౌపదీదేవి మానంబును గాపాడినట్లును—

సీ. రంగుమెఱుంగుతీ ♦ వెంగూడు ఘనమునా
బంగరుంబటము పై ♦ పయినజార,
చందురునందంబు ♦ గ్రిందుసేయంగ వి
డంబించు మంద హా ♦ సంబుమీఱ,
గ్రేపులుసొక్కగం ♦ డోపల్లాల్గరుగ ని
రూపించు పిల్లన ♦ గ్రోవి యులర,
శ్రీలుచాలఁగఁగుల్క ♦ జాలు మేలైన ము
త్యాల రత్నాల హా ♦ రాలు దనర

గీ. గ్రాల చల్దిచక్కము, చిరు ♦ గజ్జెలొప్ప,
వెలయ నెమిలిపింఛము, గురి ♦ వింద పేర్లు
వ్రేల, తనపాదసేవకు ♦ నేల, బాల
కృష్ణమూర్తి వేగమె పరు ♦ గెత్తివచ్చు.

దుర్యో: ఓరీ : వాచాటా: యిదిగో నీశిరముచెంతకు నాశరమువచ్చును గాచుకొమ్ము.

నందు : నా శిరముచెంతకు మీ శరము వచ్చునప్పటికి సహస్రశిరస్కుఁడగు శౌరి నా శిరము ననేక విధములు నిలుపఁగలఁడు,

( కర్ణ, దుశ్శాసన, శకునులు ప్రవేశింతురు )

దుర్యో: దుశ్శాసనా ! వీఁడూరక ప్రేలుచున్నవాఁడు, గదతో వీని శిరమును వ్రక్కలుసేయుము.

దుశ్శా : (కొట్టఁబోవును)

విష్ణుదూతలు: (ప్రవే) ఆఁ ఆగుమాగుము. ఓరీ ! భక్తుల కపకారమొనర్చి చెడకుము. ఓ నందభక్తుఁడా ! లెమ్ము. వైకుంఠము నలంకరించుటకీ విమాన మధిష్ఠింపుము.

నందు : (లేచుచు) మహారాజా ! యికనైన నా మాటవినుఁడు శ్రీకృష్ణ భగవానుఁడు మీ వంశము నుద్ధరింప స్వయముగా మీ కడకు రాయబారియై వచ్చునని వింటిని. ఆ మహాత్ముని యాజ్ఞను శిరసా వహించి యుభయవంశము లుద్ధరించి తత్కారణకుఁ బాత్రులరు గండు.

విష్ణు : భక్తాగ్రేసరా ! వాఁడు పరమమూఢుఁడు. వాని కవసానకాలము దాపైనది. వానితో మనకేమి రమ్ము. ( నందుఁడు "శ్రీకృష్ణ ! శ్రీకృష్ణ! రాధాకృష్ణ ! రాధాకృష్ణ !" యనుచు విమానమెక్కును. విమానముపై కెగిరిపోవును, అందఱు విస్మయంతోఁ బైకి జూచుచుందురు. తెరవ్రాలును.)

# కురుక్షేత్రము

## [ అను సంపూర్ణ మహాభారతం ]

## చతుర్థాంకము

రంగము — దుర్యోధనుని మందిరము

[ దుష్టచతుష్టయము ప్రవేశించును — నల్వురు పీఠములపై గూర్చుండియుందురు. ]

సేవకుడు: (ప్రవే) జయము జయము మహారాజా! విరాటనగరమునుండి శ్రీకృష్ణభగవానుఁడు వచ్చి ద్వారమున నున్నవాఁడు.

దుర్యో: భగవానుఁడా? (నవ్వుచు) లోనికిరానిమ్ము. (సేవకుఁడు నిష్క్రమించును) మన మనుకొనినట్లు యాదవుఁడే వచ్చినాఁడు.

శకు : మంచిది రానిమ్ము. మన యాలోచనప్రకార మీ దినమున నీకంటకమునుగూడ నూడబెరుకుదము. కొంచెము వ్యతిరేకించెనేని త్రాడులతోఁ గట్టి పడవైచుదము.

దుర్యో: సరి. మీరింక లోనికిఁబొండు. (కర్ణ, దుశ్శా, శకు నిష్క్ర)

శ్రీకృ : (ప్రవే) బావా! సుయోధనా! క్షేమమా?

దుర్యో: ఆపీఠముపై గూర్చుండుము.

శ్రీకృ : (తనలో) మర్యాదకిదియే మొదటిమార్గము. (ప్రకా) మీయన్నదమ్ములు తల్లిదండ్రులు బంధుగులందఱు క్షేమమా?

దుర్యో: ఇప్పు డేయూరినుండి వచ్చుట?

శ్రీకృ : (తనలో) అవురా! యేమి యీగర్వము?

గీ. ముదము గదురంగ నే నొక ♦ ముచ్చటడుగఁ
దానొకటి చెప్పుచుండె నీ ♦ తండు భళిర!
యవని చక్కఁగబండెనా ♦ యంచు నడుగ
నంబరము తెల్లగానుండె ♦ ననినయట్లు.

(ప్రకా) విరాటనగరమునుండి.

దుర్యో: అయినఁ ద్వరగా స్నానమాడుము.

శ్రీకృ : ఎందులకు ?

దుర్యో: భోజనముఁజేయుటకు.

శ్రీకృ : నాకొఱకు విదురునియింట నిదివఱకే పాకము సిద్ధమైన దక్కడ భుజించెదను.

దుర్యో: అయిననేమి ? నీ విక్కడనే భుజింపవలయును.

శ్రీకృ : భుజింపను.

దుర్యో: ఎందుచేత ?

శ్రీకృ : నీయన్న మమృతమైనను నాకు విషము.

దుర్యో: శూద్రునియింట గుడువవచ్చునుగాని బంధువులమును, మిత్రులమును విశేషించి ప్రస్తుతకార్యానుసరణీయులమునగు మాయింటఁ గుడువకూడదుకాఁబోలు ?

శ్రీకృ : అవును. కూడదు. విదురుఁడు శూద్రుఁడయ్యు మద్భక్తుఁడు కాన నందే భుజింతు.

దుర్యో: సరే నీయిష్టము ; కాని నాయన్నము విషమెట్లగును ?

శ్రీకృ : చెప్పవలయునా ? అయిన వినుము.

గీ. ప్రాణపంచక మాపార్థ ♦ పంచకంబు
వారికి మహావిరోధి వీ ♦ వారయగను
అరియమృతముఁ బెట్టినగాని ♦ యది విషంబు
వినుము మిత్రుఁడు విషము బె ♦ ట్టిన నమృతము.

దుర్యో: అయిన నగుఁగాని నీవు కార్యార్థి విగదా యిట్లనవచ్చునా ?

శ్రీకృ : అది వేఱుమాట. దానికి దీనికి సంబంధములేదు. నీవు నీతి గలవాఁడవై వారి యర్ధరాజ్యము వారి కిచ్చిననుసరే. యీాయ కుండినను సరేకాని నేను నా భక్తులఁ దృణీకరించి యన్యులను మన్నింపను. ఈ విషయమింక విడిచిపెట్టుదము. దీనికేమిగాని భోజనానంతరము సభఁగూర్పుము. పాండవుల సందేశమును విన్పించెద.

దుర్యో: ఆచెప్పనదేదియో యిప్పుడే చెప్పరాదా ?

శ్రీకృ : వినుము. “ తమ్ముఁడా ! దుర్యోధనా ?

మ. మానుక యన్నదమ్ముల కు ♦ మారులు రాక్షసవృత్తిఁబూని సు
జ్ఞానులు దీనులుత్తములు ♦ శౌర్యధనుల్ నిఖిలాస్త్రవైదుషీ
మానితులెల్లఁగూల నప ♦ మార్గముఁద్రొక్కి వృథాగ ధారుణీ
శ్రీవిధికోసమై మడసి ♦ రేయని లోకులు దిట్టకుండఁగన్.

గీ. మనము క్షీరనీరంబుల ♦ మాడ్కి నెపుడు
గలిసిమెలసియుండిన మేలు ♦ గలుగునట్లు
కాక యుండిన నాశము ♦ గల్గుటయె ని
జం బదియుగాక యపకీర్తి ♦ సంభవించు.

గీ. అకట రాజ్యలోపముచేత ♦ నాహవంబు
సేసి యెల్లరురు వన్నెయు ♦ వాసిదరుగ
కాలగతిఁజెందఁగా మీకు ♦ గాని మాకు
గాని యెట్లురుచించు ర ♦ క్తంపుఁగూడు ?

కావున న్యాయమార్గానుసారివై స్వయముగా, గురుపాండవుల వంశము లుద్ధరించుటకు శ్రీకృష్ణభగవానుఁడు దూతయై వచ్చుట నైనం దిలకించి సంధి కొడంబడి మా యర్ధరాజ్యమును మా కిచ్చి మీ యర్ధరాజ్యమును మీ రనుభవించి యా చంద్రతారార్కమగు కీర్తి గాంచుము. ఇదియునుంగాక—

చ. "కలరు మహానుభావులు జ ♦ గత్త్రయవీరులు ద్రోణభీష్మ క
ర్ణులు మొదలైన యోధులు ఘ ♦ నుండనటంచుఁదలంపఁబోకుము
జ్వలశరులెందఱేని గల ♦ వారలు మాకునుగూడ తమ్ముఁడా!
యలుగక యింతమాత్ర మిపు ♦ డగ్రజుమాటల నాదరింపుమా"

అని.

దుర్యో: అగ్రజుఁడా : అగ్రజుఁడా : యెవరి కగ్రజుఁడు ?

శ్రీకృ : ఏరీతినైనం దలంపుము. ద్వాదశవత్సరంబు లరణ్యవాసంబును నొక్కయే డజ్ఞాతవాసంబును నిర్వర్తించిరి.

దుర్యో: తిరిగి మీరు వనవాసాజ్ఞాతవాసంబు లొనర్పుఁడని చెప్పుము.

శ్రీకృ : ఎందులకు ?

దుర్యో: ఎందులకా? ఎందులకా? మాకు రాజ్యభోగంబు లొంటఁబట్టినట్లు, వారికవి యొంటఁబట్టినవి. ఓ నందనందనా :

గీ. గడువుదాఁటకమున్నె యా ♦ గడుసువారిఁ
గంటిమి విరాటుసంగర ♦ క్షమను మేము
నందసుత! వెండియాకార ♦ ణంబుచేత
వలయు వనవాస మజ్ఞాత ♦ వాసమిపుడు.

శ్రీకృ : అట్లుగాదు. గడువుదాఁటినతర్వాతనే వారు బయల్పడిరి.

దుర్యో: నీకు దీనితోనేమిపని ? మాతో వాదింపవచ్చితివా ?

శ్రీకృ : ఎందులకు వచ్చిననేమి? యీమాటనొక్కటి వినుము. నీవేమియు నెఱుఁగనట్లే మాటలాడుచున్నాఁడవు.

సీ. ఎఱుఁగవా ? యరిగజ ♦ మృగరాజ మనుచు ధ
ర్మజుని యవక్రప ♦ రాక్రమంబు ?
తెలియయా ? సంగర ♦ స్థలి వాయుపుత్త్రు న
ఖండగదా దండ ♦ కౌశలంబు

వీక్షింపవా ? హరు ♦ న్విజయించు గాండీవి
గాండీవిముక్త ప్ర ♦ కాండమహిమఁ
గాంచవా ? కౌదమసిం ♦ గములైన మాద్రీత
నూజుల ఘనభుజా ♦ నూనశక్తి

గీ. అరయవా ? సాత్యకి విరాటు ♦ ల ప్రతిహత
విక్రమక్రమ క్రీడాప్ర ♦ వీణు లనుచు ?
ఎంచవా ? ద్రుపదమహామ ♦ హీంద్రుబలము
నేల యూరకమడిసెద ♦ వాలమందు.

దుర్యో: (కోపముతో) ఈ మాటలు సందేశవార్తకు మంచివిగావు. నీవు వార్త దెలుపలేదు. ఉపదేశముఁ జేయుచుంటివి.

శ్రీకృ : నీవు వినఁదగినవాఁడవు కావు. రాజనీతి నుల్లంఘించి దూత నవమానించుచుంటివి. ఇది యధర్మము. తుదిసారి చెప్పుచున్నాఁడను ఆకర్ణింపుము. నీవు మదాంధుడవై యొకదాని కొకటి సమాధాన మొసంగుట నీతిగాదు.

దుర్యో: సందేశముదక్క నింకొక్కటి చెప్పుట నీతిశాస్త్రములో దూత లక్షణము గాదు.

శ్రీకృ : రాజనీతిలేనివారియెదుట వేఱుమార్గము ననుసరించుటయే దూత కర్తవ్యము.

దుర్యో: ఇట్టివారి కవమానముఁ జేయుటయే రాజనీతి.

శ్రీకృ : రావణుం డంగదు నవమానించిన వార్త నీకుఁ దెలియునా ?

దుర్యో : ప్రతి దూతయు నంగదునితో సమానుఁ కాఁజాలఁడు.

శ్రీకృ : దూతపదవి విడిచి మిత్రభావము నవలంబించి నీకు హితోపదేశమును సేయుచుంటిని. శకుని ముఖస్తోత్రములకు, దుశ్శాసనువిసొరకాయ కోఁతలకు కర్ణుని డాబులకు సంతోషించి యుబ్బితబ్బిబ్బై మోసపోకుము, వీరివలన జయము గాంతునని యూరక దురాశ పెట్టుకొనకుము.

దుర్యో: వీరి ప్రతాపోక్తులు వ్యర్థములా ? ఉక్కుతునకలని నమ్ముము. పాండవకులధూమకేతువులని నమ్ముము.

శ్రీకృ : ఈ తునకలేమియుఁ జేయఁజాలవు. నిష్కారణముగా నీకు హాని హేతువు లగుచున్నవి: ఇంకఁజాలును. నీవు దురభిమానివై చెడక యీశ్వరునిఁ బ్రార్థించుచుఁ దలవంచుకొని మహాత్ముఁడగు ధర్మజుని శరణనుము.

దుర్యో: నేను తలవంచుకొని యెచటికిఁబోవలయును ? ధర్మజునిచెంతకా? ఏమేమీ ?

గీ. బలరిపునిసైతము జయింపఁ ♦ గలుగు నేను
పాండుపుత్రకులకు భయం ♦ పడుదునొక్క
అతులితంబై తనర్చు ర ♦ త్నాకరంబు
పిల్లకాల్వలఁగాంచి భీ ♦ తిల్లునొక్క.

ఇదియునుఁగాక—

గీ. కృపుని గనలేదొ ? భీష్ము వీ ♦ క్షింపలేదొ ?
మాబల మెఱుంగలేదొ ? యీ ♦ మాటలేల ?
నే నెవఁడ ? నాతఁడెవఁడు పో ♦ పో నృశంస !
యీతఁ డీఁ బోవ డంగుళం ♦ బేని ధరను.

గీ. ఇంకఁజాలును లేచిపో ♦ మ్మెల్లవారు
జులకఁగాఁజూడ నంత భీ ♦ రులము గాము
పూనికను నెల్లవారికి ♦ నూనెదీయ
తలఁపుబుట్టి నువ్వులుగావు ♦ తరలుమింక.

శ్రీకృ : కురువంశకళంకా ! దుర్యోధనా ! పైపెచ్చింకొక యాపదఁ దెచ్చిపెట్టుకొనెదవా ? ఎక్కువసొమ్మునకై యూహించి యున్న సొమ్మునుగూడ వదలించుకొనెదవా ? ఏ శరీరమును సౌఖ్యపెట్టఁ దలఁచి రాజ్యము హరించితివో, ఆ శరీరంబును, ఆ రాజ్యంబును ఖోవక నిల్చునా ?

దుర్యో: (కోపముతో) ఈ యుపదేశంబును నీయొడిలోఁ గట్టుకొని భద్రముగా దాఁచుకొనుము. గోపికలును గోపకులును బిచ్చ మెత్తుకొనఁ బనికివచ్చును.

శ్రీకృ : సుయోధనా !

గీ. మంచిదయ్యును నాపల్కు • కొంచెమైనఁ
గాని నీ కుపయోగంబు • గాకపోయె
బ్రబ్బచెట్టున కచ్చునీ • రంబుగల్గి
యుఁ గాయమైన గాయక • యున్నయట్లు.

ఓ దుర్యోధనా! నీతల్లిదండ్రులకుఁ బుత్త్రదుఃఖంబును గల్గింపకుము. వారిభాగము వారికిచ్చుట నీకు క్షేమము. అర్ధరాజ్యము లేకున్నమానె. వారైదూళ్ళైన నిచ్చినఁజాలునని చెప్పుచున్నారు. కావున దానికైన సమ్మతింపుము.

దుర్యో: వేయిపల్కులతోఁ బనిలేదు. సూదిమొనమోపినంత భూమియైన నీయను.

శ్రీకృ : అయినచో దీని తుది వర్తమానమేమి ?

దుర్యో: యుద్ధమే.

శ్రీకృ : నేను పాండవుల కిదియే చెప్పవలయునా ?

దుర్యో: ఆ! ఇదియే చెప్పుము.

శ్రీకృ : సరే. భీష్మాదులకుఁగూడ నీసంగతియే చెప్పి మఱి పోయెదను.

(అందరు నిష్క్రమింతురు)

రంగము — యుద్ధభూమిలోని గుడారము.

ద్రౌపది: (విచారముతోఁ బ్రవేశించును) ఆహా శ్రీకృష్ణపరాత్పరునిగూడఁ దృణీకరించి సంధిని విఫలముఁజేసి యుద్ధమునకు డీకొనిరిగదా ? ఛీ ! ధార్తరాష్ట్రు లెంత భ్రష్టులు ! ఎంత మూఢులు ! అయ్యో !

భీష్మపితామహులనాయకత్వమునఁ బ్రవర్తిల్లుచున్న యీసంగ్రామ మెంత భీకరముగనున్నది ! ఈ యుద్ధమున నమూల్యములగు వస్తువులు పడిపోవుచున్నవి. అనేకులగు మహావీరుల ప్రాణములు వెలువడుచున్నవి. సముద్రపర్యంతమును మొండెములు పడు చున్నవి. లక్షలకొలంది యోధు లిదివరకే నశించిరిగదా? తక్కిన వారికిఁగూడ నేమి యపాయము వాటిల్లునోయని భయము గల్గు చున్నది. తొమ్మిదిదినములనుండి పితామహుల బాణాగ్ని కసంఖ్యాక జనంబులు శలభంబు లగుచున్నారు. గంగాజలధార వలె ఖడ్గధార విజృంభించుచున్నది. శరీరములు దగ్గఱకు వచ్చు టయే యాలస్యము. శిరములు, పాదములు, కరములు మున్నగు నవయవములెల్ల ఖండఖండములై తెగి రక్తప్రవాహములో నీఁదు చున్నవి. సూర్యోదయము మొదలు సూర్యాస్తమయము వఱకు లెక్కలేని ప్రాణములు లేచుచున్నవి. ఇట్టి ప్రళయమును గాంచిన కొలఁదియు నాహృదయ మంతకంత కుద్వేగవంతమగుచున్నది. నాప్రార్థన మంగీకరించి యెవ్వరైన శ్రీకృష్ణపరమాత్మకు విన్న వించినచో నామహాత్ముఁ డీ మహాసంగర రంగమున నాభర్తల కేమియు నాపద రాకుండ సంరక్షింపఁగలఁడు.

శ్రీకృ: (ప్రవే) అమ్మా! ఊరడిల్లుము. దూరమునుండియే నీప్రార్థన మాలకించితి. నీపాతివ్రత్యము శ్లాఘనీయము. నీయైదువతనము సురక్షితముగ నుండును. విచారము బెట్టుకొనకుము. ఏభీష్మువి వలన నీవు నీ భర్తల కపాయము గల్గునని శంకించుచుంటివో ఆయస్ఖలిత బ్రహ్మచారియగు నాభీష్మునివలననే నీముత్తయిదువ తనము నిల్చున ట్లొనర్చెదను.

ద్రౌప: (సంతోషముతో) అన్నా! యింతమాత్ర ముపకారముఁజేయుము.

శ్రీకృ: నీవిప్పుడు భీష్మపితామహులచెంత కేగవలయును ; ఒక్క రహస్యము జెప్పెద, లోనికి రమ్ము. (ఇర్వురు నిష్క్రమింతురు.)

రంగము — యు[illegible]మిలో భీష్ముని గుడారము.

[ తర్వాత భీష్మ దుర్యోధనులు ప్రవేశింతురు. ]

భీష్మ : వత్సా! దుర్యోధనా! యెందులకీపట్టుదలమాటలు ?

దుర్యో: పితామహా! నాకేమియుఁబట్టుదలలేదు. ఉన్నను మహానుభావుల రగు మీయెడల నేనా చూపవలయును ? తామే సమస్త శుభప్రద మైన తమ యనుగ్రహ కటాక్షముతో మమ్ముఁ జూడకున్నారు గాని లేకున్న నీపాటి కెప్పుడో పాండవులు ససైన్యముగ, సబాంధవముగ, సమిత్రముగ, సర్వస్వీయులతో నామావశిష్టులు గాకుందురా ?

భీష్మ : ఇది కేవలము దుర్భ్రమ. నేను కాదుగదా పరమేశ్వరుఁడైనఁ బాండవులను జయింపలేఁడు. నీక్షేమముగోరి యిదివరలో నెన్ని మారులో చెప్పియుంటిఁగాని నీవు వెఱ్ఱినమ్మకముచేఁ దుచ్ఛుల మాటలను విశ్వసించి, మోసపోవుచున్నాఁడవు. పాండవులతో సంధిగావింపుము.

దుర్యో: తాతా! నీవుగూడ యిట్లానతీయుట న్యాయమా ? ఆజన్మ మహా భాగ్యసమగ్రుఁడనై యఖిలభూమీంద్రులును నాకనుసన్నల మెలంగుచుఁ గానుకల సమర్పించుచుండ దేవేంద్రవైభవంబునఁ దేజరిల్లు నేనిప్పుడా యల్పులదరిజేరి నాపౌరుషమంతయు వమ్ము నేసికొని సాటివారిలో నగుబాటుగలుగఁ జేతులు గట్టుకొని నాకు దాసానుదాసులై యుండుటకుంగూడ తగని పాండవులపంచఁజేరి శరణాగతుఁడనై మాంపాహి ! మాంపాహి ! యని సంధి గావించుకొనవలయునా ?

భీష్మ : కుమారా! అట్లు పలుకకుము. అన్నదమ్ములకుమారులు పరస్పర మైకమత్యము గల్గియుండుట సర్వసమంజసముగదా ! నీకు బరమపూజ్యుఁడును, పితృసమానుఁడునగు ధర్మనందనునితో సఖ్యముగావించుకొని సుఖపడినచో నీ సోదరవాత్సల్యము,

నీబంధుప్రేమ, నీమృదుహృదయము, నీసాధుగుణ సమీచీన త్వము ప్రశంసనీయ మగునుగాని నీ యీజన్మ మహాభాగ్యంబు నకును, నీమహారాజత్వంబునకును, నీ దేవేంద్ర వైభవంబు నకును, నీపౌరుషమునకును లోపముగల్గునా ! ఇదేమి తండ్రీ ! ఇట్లు వక్కాణించుట యెంత విరుద్ధముగా నున్నదో, యెంత విపరీతముగా నున్నదో నీవే విచారించుకొనుము.

దుర్యో: ఆజన్మవిరోధులును, హీనాతిహీనులునగు కౌంతేయులతో సంధి గావించుకొనుమనుటకన్న విరుద్ధమేమున్నది? అంతకన్న విపరీత మేమున్నది ?

భీష్మ : అట్లుగాదు. నీకుఁ బాండవులు విరోధులెట్లగుదురు ? అయ్యో ! వారు హీనాతిహీనులా ? బిడ్డా ! నీవెంత బేలవు ! వారు మహా పరాక్రమ ధౌరేయులుగాని సామాన్యులా ?

దుర్యో: ఆఁ! వారి శౌర్యము తేటతెల్లముగఁ దెలియుచునేయున్నది. అందులో ధర్మనందనుని విక్రమము నింక వేఱుగాఁ జెప్ప నక్కఱయేలేదు.

భీష్మ : ఆహా ! యేమి నీ బుద్ధిసూక్ష్మత ! ధర్మనందనుఁడేనా నీకు సామాన్యుఁడుగాఁ గనంబడినది. దుర్యోధనా ! భీమార్జున నకుల సహదేవులే సామాన్యులని తలంపుము. ధార్తరాష్ట్రులగు మీరెల్ల రును సామాన్యులని నమ్ముము. ఇంక వీరువారనయేల, ధర్మ పుత్రునివిషయమున మనమందఱమును, వారందఱును,లోకమున నిప్పుడున్నవారందఱును సామాన్యులేకాని యతనికన్న నధికు లెవ్వరును గాఁజాలరు.

ఉ. బుద్ధిబలంబు దైవబల ♦ ము న్తన బాహుబలంబుఁగల్గు వాఁ
డిద్ధచరిత్రుఁ డుత్తముఁ డ ♦ హీనపరాక్రమ విక్రమక్రియా
విద్ధ సమస్తవైరి పృథి ♦ వీపతి ధార్మికమౌళి సత్యసం
బద్ధమనస్కుఁ డాసుగుణ ♦ వార్నిధి నెవ్వఁడు బోలజాలెడున్.

దుర్యో: అతఁడు బ్రహ్మాండనాయకుఁడే కానిమ్ము. అయిన నాకేమి ?

భీష్మ : నీకేమియులేదా ? నీయగ్రజుఁడు సకలసద్గుణ సంపన్నుఁడై సద్యశోనిధానమై సర్వసమర్థుఁడైనచో నాఘనత నీదికాదా ? అంతకంటె నీకేమికావలయును ?

దుర్యో: పితామహా ! నీవు మొదటనుండియును పాండవపక్షపాతివే. ఎప్పుడును శత్రువుల యౌన్నత్యమునే పేర్కొనెదవుగాని మమ్మణుమాత్రమైన లెక్కసేయవు.

భీష్మ : సుయోధనా ! నిశ్చయముగా నాకట్టి పక్షపాత మేమియులేదు. మీరును పౌత్త్రులు; వారునుఁ బౌత్త్రులు. మీరుభయులును నాకు సమానులే కాని, నీవు నిరపరాధులగు వారియెడల నిష్కారణముగా మొదటనుండియు విరోధము బూనియున్నవాఁడవు. కావున నిది తగదని నీవెన్నిమారులు నిరాకరించినను మీ మేలుగోరి పదింబదిగ విసువక చెప్పుచున్నాఁడను.

దుర్యో: తాతా! యిది పక్షపాతముగాదా? వారు నిరపరాధులును మేము సాపరాధులమునా ? కేవల పాండవపక్షపాతివగు నీవే యా పాండవులను మన్నింపవలయును ; గాని సమానదృష్టిగలవాఁ డెవ్వఁడిట్లు మన్నించును ?

భీష్మ : నిజమాడిన నీకుఁ గోపమువచ్చును గాని నీవు వారికిఁ జేయని యపరాధమేమున్నది? మాయాద్యూతమున వారి సకల సామ్రాజ్యమునపహరించి బలాత్కారముగాఁ గట్టుపుట్టములతో నట్టడవికి నెట్టుట వారిదోషమా, నీదోషమా? విషాన్నప్రదానము, లాక్షాగృహదాహము, ద్రౌపదీ వస్త్రాపహరణము మున్నుగాఁగలవి నీవు వారికిఁజేసిన ప్రేమసూచకములగు బహుమానంబులు గాఁబోలు : అయ్యయ్యో : పరమపతివ్రతాశిరోమణి పాంచాలి నట్లు మహాసభా మధ్యంబునఁ బరిభవింప సమకట్టినప్పుడు చూచి సహింపలేక విదురాది మంత్రిశిఖామణులకును, కుంభసంభవ

ప్రముఖ సద్గురూత్తములకును, వికర్ణాదిబాలకులకును తక్కుంగల సాధుసజ్జనుల కెల్లరకు నెంత సంతాపము జనించెను! ఎంత చిత్త క్షోభను గల్గెను ! ధర్మనందనుఁడు సమస్తసామ్రాజ్య మోడి, వీరాధివీరులగు నల్వురు తమ్ముల నోడి, తన్నోడినపిదప నా చెంత నేమియు నింక లేదనినప్పుడు "లేదా ద్రౌపదీమాణిక్య" మనిన నీవాక్య మెంతనీచము? ఎంత తుచ్ఛము? మహారౌరవాది నరకలోకంబులంగూర్చు నధమాధమమైన యవ్వాక్యము నీవెంతటి రారాజవైనను నీకు శుభముగూర్చునా? అపవిడిది నీకుఁ దగదు. నీకది కూడదని విదురాదులును నేనును నీకెంత బోధించితిమి? వింటివా? అప్పుడు కాకున్నమానె శ్రీకృష్ణభగవానుఁడంతవాఁడు లోకహితార్థము పాండవ ధార్తరాష్ట్రుల యుభయకులంబు లుద్ధరించు తలంపున స్వయముగావచ్చి చెప్పినప్పుడైన వింటివా? ద్యూతకాలమునాఁడును, ఘోషయాత్రనాఁడును, శ్రీకృష్ణ రాయబారమునాఁడును మరియుఁ బెక్కు సమయములఁగావించిన మాబోధలన్నియు బూదెపాలు గావించి యింతవరకుఁ దెచ్చితివి. సరే! యైనదేమో యైనది. పోయినకాలము తిరిగిరాదు. ఇప్పటి కైనను మించినదిలేదు. నామాట పాటింపుము. యుద్ధమును మానుకొనుము. సంధిగావించుకొని పాండవులతోఁ గలిసి సుఖం బుగ రాజ్యము నేలుకొమ్ము.

సీ. ఐకమత్యముగల్గి ♦ యార్యులు శ్లాఘింప
మీరును వారును ♦ మెలఁగరయ్య!
నామాటఁ బాటించి ♦ నాతండ్రి మనవంశ
మును నిల్పి యశము జే ♦ కొనఁగదయ్య!
సారెకు నీదయఁ ♦ గోరి ముఖస్తుతిఁ
జేయు నల్పులను ద్య ♦ జింపుమయ్య!
యుభయవంశంబుల నుద్ధరించిన నిన్ను
భగవంతుఁడెపుడు కా ♦ పాడునయ్య!

గీ. మేము కన్నులుచల్లగా • మీదువృద్ధి
గాంచి సతతంబు దీవించు • కొంచు నింక
నైన జీవితశేషము • నమృతసౌమ్యా
కేవలానందముగను ము • గింతుమయ్య!

దుర్యో: పితామహా! వేయిమాటలేల? నాకంఠమునఁ బ్రాణములున్నంత వఱకును బాండవులు నాకు విరోధులేగాని, విహితులుగారు. వారితో నేనెన్నఁడును సంధి గావింపను.

భీష్మ: అయ్యయ్యో! యిప్పటికైనను నామాట వినవా? సాత్త్విక శిఖామణియగు ధర్మపుత్రునితోడి విరోధము నీ కుచితముగాదు. పెద్దవాఁడననియైన గౌరవించి నామాటవిని వారితో సఖ్యము గావించుకొనుము. నీవు దీర్ఘాయుష్మంతుడవై యుందువు. సర్వ సంపత్సమృద్ధిగలిగి యమోఘంబుగఁ బ్రకాశించెదవు. పరస్పర విరోధములను మఱచి మీరును, వారును క్షీరనీరంబులవిధంబునఁ గలిసిమెలసి యుండినచో మన వంశమున కెంత ప్రతిష్ఠయో, యెంత గౌరవమో నీవె కొంచెము సావకాశముగ విచారించు కొనుము. అన్యోన్య సాహాయ్యార్థము యుద్ధమొనర్చెడు యీమీ బంధువులును, మీమీ సేవకులును, మీమీయాచార్యులును, మీమీ పుత్రులును, మీయైకమత్యమునకు సంతుష్టాంతరంగులై సుఖం బుగాఁ దమతమ గృహంబులకరిగి భార్యాపుత్రాదులతోఁగూడి మహానందరసనిమగ్నులై చక్కఁగాఁ గాలము గడుపుకొందురు. మిమ్మెల్లరును మహానందంబున నాశీర్వదింతురు. మీకు సర్వ శుభములును జేకూరును. ఏమీ! మాటాడవు? (దుర్యోధనుఁడు సంధి కనిష్టము సూచింప) సంధి గావింపవా? సంధి గావింపవా? సర్వవినాశముఁ జేయుటకే కంకణముఁ గట్టుకొంటివా? కూడదు. కూడదు. సుయోధనా! నీవంటి సద్వంశసంభూతున కిది కూడదు. అయ్యో!

సీ. నీపైని ప్రాణము ♦ ల్నిలిపిన నీ తండ్రి
ధృతరాష్ట్రుఁ డవనిపై ♦ బ్రతికియుండ
నీకెల్లవిద్యల ♦ నేర్పిన ద్రోణము
ఖ్యులమేన జీవముల్ ♦ నిలిచియుండ
నీ క్షేమమునకునై ♦ నిత్యమ్ముదపియించు
విదురాదిఘనులు జీ ♦ వించియుండ
నీకయి దేహము ♦ న్విడువఁగానున్న నా
యాత్మ యీ దేహము ♦ నందునుండ

గీ. సైన్యనాశనము గురునా ♦ శనము మిత్ర
నాశనము బంధుజననాశ ♦ నమును వంశ
నాశనము వీరభట నాశ ♦ నమును సర్వ
నాశనముఁ జేయనేల న ♦ న్గన్నతండ్రి !

దుర్యో: పితామహా ! యేమి నీ మాటలు ! ఏమి నీ పాక్షిక స్వభావము ;
ఈ మాటలే ధర్మరాజాదులతో నేలచెప్పఁగూడదు ?

భీష్మ : వారితో నేమని చెప్పమందువు ? అట్లే చెప్పెదఁ జెప్పుము !

దుర్యో: "నిష్కారణముగ నిందఱిని వధింపనేల ? యుద్ధమును మాను కొందు" అని.

భీష్మ : అట్లేచెప్పి మాన్పించిన వారి యర్ధరాజ్యము వారి కిచ్చెదవా ?

దుర్యో: ఈ జన్మమునఁ గాదుకదా, పై జన్మమునఁగూడ నీయను.

భీష్మ : ఇది న్యాయముగ నున్నదా ? దుర్యోధనుఁడు మీకు భాగ మొసంగఁడు. మీరు యుద్ధమునుమాని దీనులై నెత్తిపై గుడ్డ వైచుకొని యా జన్మాంత మరణ్యవాసముఁ జేయుఁడని చెప్ప వలయునా ? సుయోధనా ! నిష్కారణముగ నేలచెడిపోయెదవు ? అర్ధరాజ్య మీయకున్న మానె, శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్టు లైదుగురకై దుగ్రామములనైన నొసంగరాదా ? ఎట్లో కష్టపడి వారిని సమ్మతింపఁజేసెద. యుద్ధమున జయాపజయములు

దైవాధీనములని నీవే యనుచుందువుకదా! ఒకవేళ వారే జయించినచో నీకుఁ జేనెఁడు భూమియైన నుండదు. ఇప్పుడో వారి కైదు గ్రామములే శేషించును. ఇంక నీవు సమస్త సామ్రాజ్య సర్వస్వ సమేతుఁడవు గాఁగలవు. దీనికైన నేమందువు ?

దుర్యో: అయిదుగ్రామములు కావుగదా. సూదిమొనమోపినంత భూమినైన నీయను.

భీష్మ : అయిన నీకు వినాశకాల మాసన్నమైనదనియే తోఁచుచున్నది.

దుర్యో: వారికో ?

భీష్మ : వారు ధర్మస్వరూపులు. వారికి శ్రీకృష్ణుఁడు బాసటయై యున్నవాఁడు.

దుర్యో: వారికొక్క శ్రీకృష్ణుఁడే బాసటయైయున్నాఁడుగాని, నాకతని మించిన కర్ణాదులు కోటానకోట్లు బాసటయై యున్నవారు.

భీష్మ : కర్ణుఁడు సాక్షాత్పరమేశ్వరుఁడని తలంచి నీవేమో త్రుళ్ళిపడు చుంటివిగాని వీఁడు వారిలోని యొక్క యల్పునకైనఁ జాలఁడు. ముఖస్తుతిపరాయణుండును, మహామునిశాపదగ్ధుండును, సకల దంభస్వరూపుఁడును, గుక్షింభరియునైన యీతులువ "వానిని గెల్చెద వీనిని గెల్చెద" నని సిగ్గులేక రజ్జులాడుచుండును. నీచుఁడును, స్వల్పుఁడునగు వానిమాయలోఁదగిలి వాని దంభములనువిశ్వసించి నీవును, ఉత్తమోత్తములును, మహాబలవంతులును నగు కౌంతేయులతో విరోధించి నిష్కారణముగ వారికిఁ గీడు గోరుచుందువు. వారిలో నొక్కఁడొక్కడే పెక్కు సంగ్రామ రంగంబులందు బరిపంథిసమూహంబులనిర్జించి విఖ్యాతి నార్జించిన వాఁడు. వీఁ డేయుద్ధమున జయించెను ? గోగ్రహణమునాఁడు లేఁడా? ఘోషయాత్రనాఁడులేఁడా? మహాసమర్థులగు వారెక్కడ? నిరర్థక వాచాలకుఁడగు వీఁడెక్కడ ? ఖాండవదాహము, పరమేశ్వర విజయము, కాలకేయ సంహారము మున్నగు మహా

కృత్యము లమానుషములని యెఱుంగవా ? విజయుఁడును ధనుష్మంతుఁడే : కర్ణాదులును ధనుష్మంతులే ; పర్వతంబును బదార్థమే : తృణలేశంబును బదార్థమే. కాని, భేదములేదా ? సుయోధనా! నీకు జీవితేచ్ఛ యున్నయెడల నిట్టికర్ణాదులను నమ్మి చెడిపోకుము. ఈ కర్ణుఁడేమి వీనింబోలినవారు కోటానకోట్లున్నను, పాండవేయులవలన నీకపజయము తప్పదు. తప్పదు. ముమ్మాటికిఁ దప్పదు.

సీ. పగ్గముల్గొనికృష్ణ ♦ పరమాత్మ సారథి
యై రథంబును దోలు ♦ నంతవఱకు
సింహనాదంబులు ♦ సేయుచు హనుమ, ధ్వ
జాగ్రంబునం దుండు ♦ నంతవఱకు
భీమగదాదండ ♦ పృథులధ్వనుల్ దిక్కు
లన్నిటన్ మార్మోయు ♦ నంతవఱకు
అనఘ ధర్మజునిక్రో ♦ ధాగ్ని భగ్ భగ్గుమ
టంచు మండుచునుండు ♦ నంతవఱకు

గీ. నిష్ఠురనినాద నిర్ఘాత ♦ నిర్ఘృణోగ్ర
గాండివోద్ధసముద్దండ ♦ కాండజలధ
రావళులు నీబలము ముంచు ♦ నంతవఱకు
నీకు రణమం దపజయంబు ♦ నిశ్చయంబు.

దుర్యో: ఆఁ: అదేమిమాట? జయ మొకరి స్వాధీనమా ?

భీష్మ : ఆఁ! స్వాధీనమే. భగవంతుఁ డేవైపుననుండునో, భగవత్స్వరూపమగు ధర్మము నెవ్వరు ప్రాణాధికముగాఁ దలంతురో, అచ్చట జయము నిశ్చయము. వారికి జయము స్వాధీనమై యుండును. శ్రీకృష్ణభగవానుఁడు వారికి విధేయుఁడై యున్నవాఁడు. వారు ధర్మైకజీవనులు. వారికి జయము గల్గుటకు సందేహమేమి? నీవు విషవృక్షంబవు. ధర్మనందనుఁ డమృత

వృక్షము. నీకు పరమదాంభికుఁడగు రాధేయుఁడు స్కంధము. ధర్మనందనునకు సార్థకనామధేయుఁడగు విజయుఁడు స్కంధము. నీకు ద్యూతవిద్యానిపుణుండగు శకుని శాఖ; ధర్మపుత్రునకు మహాపరాక్రమ ధౌరేయుఁడగు భీమసేనుఁడు శాఖ. నీకు దుర్మదాంధుఁడగు దుశ్శాసనుఁడు పుష్పములు. అతనికిఁ బరమ విధేయులగు నకులసహదేవులు పుష్పములు. నీకు వివేకశూన్యుండును, సర్వవిధముల నంధుఁడగు ధృతరాష్ట్రుఁడు మూలము. అతనికి సకల చరాచర సృష్టిస్థితిలయ హేతుభూతుండును, భగవంతుడునగు శ్రీకృష్ణుఁడు మూలము. తెలిసినదా? ఇంక నెవ్వరికి జయముస్వాధీనమో, యెవ్వరికపజయంబు సిద్ధాంతమో, నీవే విచారించుకొనుము.

దుర్యో: అయిన మా కపజయమే సిద్ధాంతమా?

భీష్మ: సందేహముకూడనా? మీ దుష్టచతుష్టయంబున కపజయంబేగాక యాచంద్రతారార్కమగు నపయశంబుగూడ సిద్ధాంతమే.

దుర్యో: మీరు పెద్దలు. ఎట్లు దూషించినను దూషింపవచ్చునుగాని కుంభసంభవ ప్రముఖ గురూత్తమ పరిరక్షితంబై, రాధేయప్రముఖ మహాధానుష్కమండితంబై, యజేయపరాక్రమక్రమంబున దేవతలకు నైతము దేరిచూడరాని తమవంటి యతిరథశ్రేష్ఠుల నాయకత్వంబునం బరిపాలితంబగు మదీయ స్కంధావారంబును, ఆహా! యెంతలో నెంత నిస్సారముగాఁ దృణీకరించితిరి. వారు గాదుకదా. త్రిమూర్తులు వచ్చినను మనల జయింపఁజాలుదురా?

భీష్మ: నీ వనినది వాస్తవమేకాని, సర్వాతిశయమగు ధర్మము వారి యొద్ద నున్నది. జయస్వరూపుఁడగు శ్రీకృష్ణుఁ డందున్నవాఁడు. కావున నీ కపజయము సిద్ధాంతము.

దుర్యో: నీ వాక్యములు అవిశ్వసనీయములు, అన్యాయములు, అనాదరణీయములు, అగ్రాహ్యములు.

భీష్మ : అవు నేలకావు ? ఇచ్చకముల కాసించి ప్రియములాడు కర్ణాదుల వాక్యములు గ్రాహ్యము లగునుగాని, నీ క్షేమముగోరి హితముఁ జెప్పు నా వాక్యము లెట్లు గ్రాహ్యము లగును ? ఇంతకు నీ చెడుకాలమే నీకిట్టిబుద్ధి బుట్టించుచున్నది. నేనేమి సేయుదును ?

దుర్యో: నాకుఁ జెడుకాలమేమి ?

భీష్మ : చెడుకాలముగాక మంచికాలమా ? తొందరపడకుము, క్రమక్రమముగా అన్నియు ననుభవించెదవు. నీ దుష్కార్యాచరణముం దలంచి యిప్పుడు గాకున్నను సర్వము తీరినతర్వాతనైన నీకుఁ బశ్చాత్తాప ముదయింపక తప్పదు. పాపము ! సాధుసంతాప మూరకపోవునని విఱ్ఱవీగుచున్నాఁడవు కాబోలును !

సీ. జనన మాదిగ నొన ♦ ర్చిన నీదు దుష్కృత్య
  ముల ఫలం బూరక ♦ పోవునొక్కొ ?
సాధ్వీమణీ మన ♦ స్సంక్షోభము కులక్ష
  యంబు సేయక శాంతి ♦ నందునొక్కొ ?
అత్యంతనీచ సాం ♦ గత్యంబుఁ జేసినం
  దులకు లాభంబును ♦ దెలియవొక్కొ ?
గౌరవధ్వంస మ ♦ ఖర్వగర్వంబు క్రిం
  దికిఁద్రొక్కి నొక్కి బో ♦ ధింపదొక్కొ ?

గీ. న్యాయముగ నీయఁదగిన రా ♦ జ్యార్ధమిడక
యంతయును నాదియే యని ♦ యనిశము దిగ
సాగు నీ దురాశాపిశా ♦ చంబు నిన్నుఁ
బీల్చి పిప్పిగావింపక ♦ విడుచునొక్కొ ?

దుర్యో: పితామహా ! క్రోధమూర్తివై యేల యిట్లు దూషించెదవు ? న్యాయమువలదా ? ధర్మమక్కఱలేదా ? నిజము విచారించిన క్షత్రియకులాచారంబైన శత్రు నిబర్హణము నా కనుచితమా ?

భీష్మ : ఆదినుండియు నీ దుస్స్వభావమిట్టిదే. పాండవులు నీకు వైరులా.
ఏమీ పినతండ్రి కుమారులు నీకు విరోధులా ? సర్వసమర్థులై ?
సోదర స్నేహసమంచితులై తమతండ్రి సంపాదించిన సామ్రాజ్య
మంతయు బాంధవంబున సత్వశిరోమణులై మీ యఱచేతంబెట్టిన
పాండునందనులు నీకుఁ బరమవిరోధులా ? ఆప్తనిగర్హణమే
శత్రునిబర్హణమా ? భాందవాపచారమే క్షత్రియకులాచారమా ?
(తలయూపి) అవును. నీకట్లే—

సీ. పరమనీచములైన ♦ పాచికలే, మహా
శితశరాంభోధి వీ ♦ చికలునీకు.
సర్వనాశకమైన ♦ సజ్జనక్షోభంబె
సర్వాధిరాజ్య లా ♦ భంబు నీకు,
మహిత పతివ్రతా ♦ మానభంగంబె, వి
క్రమవీరసమర రం ♦ గంబునీకు,
సతత మహాపురు ♦ షకృత నిరాకర
ణంబె దివ్యాభర ♦ ణంబునీకు,

గీ. మలిన మధమంబునకు ద్యూత ♦ మండపంబె
పావనంబౌ సభామండ ♦ పంబునీకు,
బంధువులు మిత్రులగునట్టి ♦ పాండుపుత్రు
లవుర యేమందు బరమశ ♦ త్రువులు నీకు.

దుర్యో: అవును. ముమ్మాటికిని వారు నాకుఁ బరమశత్రువులే.
భీష్మ : అగుఁగాక ! శత్రువు లధికులై యున్నతరి నొదిగియుండుట
క్షత్రియ లక్షణముగదా ! కావున యిప్పుడు పాండవు లధికులై
యున్నవారు. దీనింబట్టియైన వారితో సంధి గావించుకొనవలయునే!
దుర్యో: వారు నాకన్న నధికులుగారు. వారిసఖ్యము నా కక్కఱలేదు.
భీష్మ : ఎందుచేత ?

దుర్యో: ఎందుచేతనో చెప్పవలయునా ? అట్లయినఁ బలుమాటలేల ? నా మనోనిశ్చయ మెఱిఁగింతు వినుము.

సీ. క్షాత్రధర్మముల కా ♦ స్థానమౌ భారతా
న్వయమునం జనియించి ♦ నాఁడఁగానఁ
జనియించినదిమొద ♦ ల్కొని పాండుపుత్రుల
న్శత్రులగతి నెంచి ♦ నాఁడఁగానఁ
నదియిడియనక యీ ♦ యవనితలంబు నిం
తటిదాఁక పాలించి ♦ నాఁడఁగానఁ
బాండవు లడవులఁ ♦ బలుకష్టములఁగన
న్హాయిగా సుఖియించి ♦ నాఁడఁగానఁ

గీ. దాతలుం దమ్ములుం గురుల్ ♦ తక్కుదొరలు
నొక్కరనియేల యెల్లరు ♦ నుండి ధరను
బ్రదికినాఁడను చచ్చినన్ ♦ వారిగలిసి
రాణమీర నేలుదు స్వర్గ ♦ రాజ్యలక్ష్మి.

ఇంకఁ బాండవులన్ననో—

గీ. పడిరి వనమందుఁ బడరాని ♦ పాటులెల్ల
ననువుగాఁ గందమూలము ♦ లను భుజియించి
తాతలున్ గురులున్ బంధు ♦ తతియుఁగూలఁ
గుడిచెదరుగాక నెత్తురు ♦ కూడునింక.

ఇంక సంధిమాట నాకడ నుచ్చరింపవలదు.

భీష్మ : (విసుగుతో) పోనీ ! నీకర్మమున కెవరేమిచేయగలరు ?

గీ. మంచిదయ్యును నాపల్కు ♦ కొంచెమైన
గాని నీ కుపయుక్తంబు ♦ గాకపోయె
బ్రబ్బచెట్టున కచ్చనీ ♦ రంబుగ్గిలి
యున్నఁ గాఖైనఁగాయక ♦ యున్నయట్లు.

కానిమ్ము. నీకధీనుఁడనై యున్నవాఁడనుగాన శక్తివంచనలేకుండఁ బోరాడి నా దేహమును నీకర్పింతును.

దుర్యో: ఎప్పుడు నిట్లనుటయేగాని, పాండవులమీఁది యనురాగము యుద్ధరంగమున మిమ్ము వివశులను జేయుచున్నది. కానిచో జగదేకవీరులగు మీ యర్జునుఁడెంత. యీ కృష్ణుఁడెంత ?

భీష్మ : దుర్యోధనా ! నిష్ఠురము లాడకుము. నన్ను నీవు నమ్మకొని యుంటివని నేనెఱుంగుదును. ఆశ్రయించినవారియెడల నేను ప్రాణములనుఁ దాఁచుకొనువాఁడనుగాను. కాని నీ కిదివఱకే చెప్పితిని. జయాశమాత్రము పెట్టుకొనకుము. ఊరక బ్రతుకలేక శక్తియున్నంతవఱకుఁ బోరాడి ప్రాణములను విసర్జింతును.

దుర్యో: అశ్లీలము లానతీయకుఁడు. ప్రాప్తి యెట్లున్నదో యట్లు గాఁగలదు. రేపటి కర్తవ్యముంగూర్చి పేరోలగంబున విచారింతము రండు.

భీష్మ : సంధ్యావందనసమయమైనది. ఆ కృత్యము నిర్వర్తించి వచ్చెద. నీవు పొమ్ము.

( అందరు నిష్క్రమింతురు )

# కురుక్షేత్రము

## [ అను సంపూర్ణ మహాభారతం ]

## పంచమాంకము

రంగము — బావి

[ తర్వాత భీష్ముడు సంధ్య వార్చుకొనుచుండ శివుడు ప్రవేశించును. ]

శివుడు: (భీష్ముని జూచి) ఓహో! పెద్దమహారాజుగారు పూజలో గూర్చున్నవారు. హారతియిచ్చు సమయమైనది. పంచములు తెచ్చుకొనుబావికిబోయిన నింకను జాగుకాగలదు. ఇందే నీరు దోడుకొనియెద. (అని భయపడుచు ముందు గాలువైచి) ఎవ్వరైన జూచినచో గొట్టగలరు. (ఆలోచించి) ఎందులకు గొట్టుదురు: ఒకవేళ గొట్టినను వారికి జేతులుజోడించి యింక గొట్టుడింక గొట్టుడిది నారాయణునకు భోగ్యముగదా యని విన్నవించెద.

శాంత : (ప్రవే) ఎవరురా బావిదగ్గర?

శివుడు: అమ్మా! నేను శివుడను.

శాంత : ఏశివుడవు?

శివుడు: సీతారాముడను పంచముని కుమారుడను.

శాంత : నిన్నెవ్వ డీ బావిచెంతకు రమ్మనిరి?

శివుడు: అమ్మా: యెవ్వరు ననలేదు.

శాంత : నీవు పంచముడవు? నీకన్నులు కాలిపోయినవా? ఈకూపము మందిరమున కుపయోగమైనదియా? మాదిగల కుపయోగమైనదియా?

శివుఁడు: తల్లీ! యీమాటసత్యమే: ఈనీరము పంచములకేర్పడినదికాదు.

శాంత : కాకున్నఁ దోలుబొక్కెనతో బ్రాహ్మణులకు నీరుద్రాగింతువా ?

శివుఁడు; లేదుతల్లీ! భగవంతునకు భోగముజేయువేళ యతిక్రమించు చున్నది.

శాంత : భగవంతునకా: భగవంతునకా! యెందులకుఁగాదు? చండాలురు గూడ యిప్పుడు భగవంతుని బూజింప మొదలుపెట్టిరి.

శివుఁడు! జననీ: భగవానుని కొకబొక్కెననీరునుద్వరగాఁజేదుకొననిమ్మ.

శాంత : పోపో: అక్కడ మాదిగలబావి యున్నది ; అక్కడ నీరు దెచ్చుకొమ్ము; జాగ్రత్త; ఎప్పుడును భగవంతుని నామ ముచ్చ రింపకుము; తిరిగి యనినయెడల నీనాలుక జీలికలు సేయింతును; నీకుటుంబమును గంగలోఁ గల్పెదను; భగవంతుఁడు నినివేదన కొఱకే యాఁకలిగొని యున్నాడాఁయేమి ?

శివుఁడు: పవిత్రురాలవైన యోతల్లీ: శ్రీరాముని ధ్యానింపుము; నేను నిత్యమును శ్రీరాముని బూజించుచున్నాఁడను; నేను బెట్టిన యన్నమును భగవానుఁడు కడుపునిండ దిని పోవుచున్నాఁడు.

శాంత : ఊరక యఱవక పో పో పో !

శివుఁడు: అమ్మా! బీదలయందు దయయుంచిన మంచి కాఁగలదు.

శాంత : సుంతయైన లజ్జలేక వాగెదవేమిరా? పోయెదవా? లేక తర్జన భర్జనంబులు గావలయునా ?

శివుఁడు: అమ్మా! నీయిష్టమువచ్చినట్లు కావింపుము.

శాంత : ఓరీ చండాలుఁడా! యెట్టిమాటలాడుచుంటివిరా! నీకుఁ గొంచె మైన నభిమానములేదా ?

శివుఁడు: నేనసత్యమాడినఁ బాదరక్షతోఁ గొట్టింపుము.

శాంత : ఊరక యిట్లే వాగుచున్న నంతపని గాకపోవునా ?

శివుఁడు: తల్లీ ! శాంతింపుము.

ద్రౌప : (ప్రవే) శాంతా ! నీవెందుల కీతనితోఁ గలహింతువు ?

శాంత : రాణిగారూ ! చూడుఁడు మందిరపుబావిలో మాదిగవాఁడు తోలు బొక్కెన వైచుచున్నాఁడు.

శివుఁడు: మహారాజ్ఞిగారికి దండము. ఈ సేవకుని మనవిగూడ కొంచెము వినుఁడు: నేనొకవేళ యమృతమాడిన నా నివేదన భగవంతునకు లభింపకుండుగాఁక : హారతిసమయము గానన్లైన నేను పంచముల బావికేపోవుదును. తొందరయుండుటచే నిక్కడకు వచ్చితి. నా తప్పు మన్నింపుఁడు.

ద్రౌప : మీ యింటఁగూడ భగవత్పూజ యగునా ?

శివుఁడు: మహారాజ్ఞిగారూ ! నిత్యమును జరుగును.

శాంత : అమ్మా : యీ చండాలునిమాట వినుచున్నారా ?

ద్రౌప : చెల్లెలా శాంతా : నీవు కొంచెము శాంతింపుము. ఈ కలహమందేదియో రహస్య మతి గంభీరముగా నున్నది.

శాంత : అదియేమి ?

ద్రౌప : నిరాకారుఁడైన భగవంతునిబూజింప నొకరియాజ్ఞ కావలయునా?

శాంత : నిరాకారునకు చండాలురయం దనురాగమా ?

ద్రౌప : అదేమిమాట ? యెవ్వరా హరినర్చింతురో వారే యతనికిఁ బ్రియులు. యుద్ధమందెవరు ముందంజవేయుదురో వారేశూరులు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలో నెవఁడైన గానిమ్ము. వారి కులగోత్రములతోఁ బనిలేదు. వారి కృత్యములఁ బట్టి మన్నింపవలయును. మరియు——

గీ. తండ్రికెందరో పుత్రు లు ♦ ద్భవమునొంద
నందఱొకరీతిగా నుండు ♦ రా తలంప
నట్టులే హీనకులజులు ♦ నగ్రకులజు
లందఱుం బుత్రులేసుమ్ము ♦ హరికిఁజూడ.

కావున నందఱిలో నెవరు సద్వర్తనము గలవారో వారియందే తండ్రికిఁ బ్రీతి యెక్కువ. అట్లే భక్తులెవ్వరో వారియందే భగవానునకుఁ బ్రేమ యెక్కువ.

శాంత : అట్లేనా :

ద్రౌప : ఒక బ్రాహ్మణుఁడు చెడి కటికవాఁడైన బ్రాహ్మణుఁ డందురా, కటికవాఁ డందురా ?

శాంత : కటికవాఁ డందురు.

ద్రౌప : అప్పుడు కులముపోయి ప్రవర్తనమే పేరునకు వచ్చునది. కావున బ్రాహ్మణుఁడు నీచకృత్యము లొనర్చిన నెట్లు నీచుఁడని పిల్వఁబడునో యట్లే చండాలుఁడైనను సత్కృత్యముచే మంచి వాఁడని పిల్వఁబడును. చండాలుఁడైన మాత్రమున వానినిఁ దిరస్కరించుట న్యాయమా ? అయినను నీ చిత్తము నొప్పింప నే నతనికి నీరువోసి మీ కలహము నివారించెద, ( అని శివునకు నీరుబోయును. శివుఁడు నిష్క్రమించును.)

శాంత : అమ్మా! నేను చాల పొరపడితిని. కొంచెముమాటను బెద్దజేసితిని. నేను వానికి నీరు వోయలేదు. అజ్ఞానముచే బుద్ధి చెడిపోయినది. అందఱి శరీరంబులును బంచభూతములచే నిండియుండును. అదియే ఆకాశము, అదియే యగ్ని, అదియే మృత్తిక, అదియే వాయువు, అదియే జలము, బీదవానిని నిష్కారణముగ నాడరాని మాటలాడితి. నిప్పుడు వానిమీఁద జాల జాలిపుట్టుచున్నది.

ద్రౌప : మంచిది. ఎప్పుడును బ్రతిభూతమందును దయగలిగి వర్తింపుము. ఇంక నీరుజేదుకొని పొమ్ము. (శాంత నీరు దోడుకొని పోవును) ఇంకఁ బితామహు నారాధించెద. (అని భీష్మని బూజించును)

భీష్మ : దీర్ఘ సుమంగళీభవ : దీర్ఘ సుమంగళీభవ ! ( అని దీవింప ద్రౌపది నమస్కరించి నిష్క్రమించును)

భాను : (ప్రవేశించి) (తనలో) భగవంతునకు నేఁడు నా యందుఁ బరి పూర్ణానుగ్రహము గల్గినది. ఈ మహాత్ముని యాశీర్వచనము ముల్లోకములు మున్గినను దప్పబోదు. (భీష్మ బూజించును)

భీష్మ : నీ వెవ్వతెవు ?

భాను : తాము నా నాధునితో నా పూజాకాలమున నీ భార్యనంపిన నీకు మేలుగావించెదనని యానతిచ్చి యుంటిరి. తమ యాజ్ఞప్రకారమే వచ్చితిని. నేను భానుమతిని.

భీష్మ : ఏమి : దుర్యోధనుని భార్యవగు భానుమతివేనా ?

భాను : చిత్తము.

భీష్మ : నీ విప్పుడేకదా నన్ను బూజించి యాశీర్వచనమంది యేగితివి. మరల వెంటనే తిరిగివచ్చితివేల ?

భాను : నే నిదియే వచ్చుట.

భీష్మ : అయిన నా పూజ నెవరుగాంచిరి ? నేను దీర్ఘసుమంగళివికమ్మని దీవించితినే.

భాను : ఎవరువచ్చి మిమ్ము పొరపెట్టిరో, పరమేశ్వరునకెరుక.

భీష్మ : (విచారించి) తెలిసినది. ఇందుఁ నీ పొరపా టేమియులేదు. విధాత ద్రౌపది ఫాలంబునఁ బెద్దకాలము ముత్తయిదువ గమ్మని వ్రాసినాఁడు. కావున నామె ముందువచ్చి వరము బడసినది.

భాను : మహాత్మా : నన్నును మీరట్లే దీవింపుఁడు.

భీష్మ : కర్మమువలననే యన్నియు సంప్రాప్తములగును. కర్మమహిమ యపారము. ఎవ్వరిచ్చినను గర్మననుసరించియే యిచ్చెదరు. పోయినవేళ తిరిగి రానేరదు. మృణ్మయపాత్ర మొకసారి పనికి వచ్చునుగాని రెండవసారి పనికిరాదు.

భాను : మహాత్మా ! అట్లైన నూరక నిరాశనై పోదునా ?

భీష్మ : నేనేమిచేయుదు. అదృష్టము నీకిట్లున్నది. (భీష్ముఁడులోనికేగును)

భాను : (నిరాశతో ముందుకు నడచి)

గీ. అక్కటక్కట పతిహీన ♦ నగుచునుండ
వలసినప్పు డేపగిదీ సౌ ♦ భాగ్యమబ్బు
భూతలములోపలఁ బిపాస ♦ చేతఁ జావ
వలసినప్పుడు నీరమె ♦ ట్టులు లభించు ?

(నిష్క్రమించును)

రంగము—ద్రోణాచార్యుని మందిరము

[ ద్రోణాచార్యులు పూజాద్రవ్యముల సిద్ధము
చేసికొనుచుండ శాంత నీరుతో ప్రవేశించును ]

ద్రోణు: శాంతా : నీవింత యాలసించితివేమి ?

శాంత : అవును తండ్రీ: బావిదగ్గఱ ద్రౌపది మహోపదేశము వినుచుండుటచే నాలస్యమైనది. ఇప్పటికే పూజాసమయము సమీపించెనని త్వరత్వరగా వచ్చితి.

శిష్యుఁడు: (ప్రవే) గురూత్తమా : దుర్యోధనుని యశ్వపరిచారకుఁడేమో చెప్పుటకు వచ్చియున్నవాఁడు.

ద్రోణు: మంచిది. శాంతా: నీవునేఁడు భగవంతునిఁబూజించి హారతియిమ్ము నేను ప్రత్యుత్తరముఁ జెప్పివచ్చెద. (చేతితోఁజూపుచు) బిడ్డా :

క. ఇదియే గంధము శర్కర
యదియే యిదెగంట సుమము ♦ లయ్యవియే నీ
రదదేహున కుపచారము
ముదమొదవన్ జేయుమమ్మ ♦ ముద్దులగుమ్మా !

[ ద్రోణుఁడు నిష్క్రమించును ]

శాంత : పూవులుజల్లి పూజించుటయు, నివేదన జేయుటయు నెవరికి ? ద్రౌపది చెప్పెనుగదా : "యీశ్వరుఁడు నిరాకారుఁడు, సర్వవ్యాపకుఁడునని. ఆ మాట నిశ్చయమైన నీ పూజ యనవసరము. నా కేమియుఁ దోపకున్నది. (ఆకసమువంకఁజూచుచు చేతులు జోడించి )

సీ. పరమాత్మ నీపాద ♦ పద్మముల్పూజింప
నెంచి యీ గతి విచా ♦ రించుచుంటి
విమలచరిత్ర ని ♦ న్బిలిచివర్ణింపఁగా
నాకన్నుగవకుఁ గ ♦ న్పడకయుండి

వఖిలేశ నీవు భూ ♦ తాంతరంగ నివాసి
వని జ్ఞానులగువార ♦ లనఁగవింటి
నఘదూర నీవు ప్ర ♦ త్యక్షమైనంతట
మించి గంటనుగొట్ట ♦ నెంచుకొంటి
గీ. నొనర సుమములపైఁగూడ ♦ నున్నవాఁడ
వట్టియెడ నింక నొకదేవు ♦ నమలభావు
నేవిధిన్పూజఁజేసెద ♦ దేవదేవ
కలితసద్గుణధన్య ! యా ♦ కారశూన్య.

( గోడపగిలి శ్రీకృష్ణుఁడు శాంతకు దర్శనమిచ్చును. శాంత భయపడును )

కృష్ణ : నిరాకారుఁడనై నను సాకారుఁడనగు నాశుద్ధస్వరూపమును సావధానముగఁ దిలకింపుము.

ద్రోణు: (ప్రవేశించి, కృష్ణునిజూచి) జగదీశ్వర ! కృష్ణా ! రక్షింపుము. నీదర్శనముజేసితి కృతార్థుఁడనైతిని. ఇదిగో నీకు నమస్కారము. (మ్రొక్కును.)

కృష్ణ : నేను భక్తపరాధీనుఁడను ! ఎవ్వరు నన్నుఁ ద్రికరణశుద్ధిగా స్మరింతురో, వారికిఁ దప్పక సాక్షాత్కరింతును.

ద్రోణు: శాంతా! పూజాద్రవ్యములన్నియు నున్నట్లే యున్నవి. నీవు వీనిపైఁ జేయిసైతము వేయలేదు. భగవత్సాక్షాత్కారమున కేమీ పూజచేసితివి ?

కృష్ణ : నీవు నిత్యమును బహిఃపూజఁ జేయుచుంటివి. ఈమె మానసిక పూజ గావించినది. అందుచే దర్శనమిచ్చితి. ఈమెవలన నీకును నన్నుజూచుట తటస్థించినది.

ద్రోణు: ధన్యుఁడను. ధన్యుఁడను. పరమాత్మా ! ధన్యుఁడను.

సీ. పరమాత్మ ! నీ పాద ♦ పద్మముల్ సేవింప
వలెఁగదా కన్నులు ♦ గలఫలంబు
శ్రీరాధ ! నీనామ ♦ చింతనంబొనరింప
వలెఁగదా నాలుక ♦ గలఫలంబు

దైత్యారి! నిన్ను య ♦ థాశక్తిఁ బూజింప
వలెఁగదా హస్తము ♦ ల్గలఫలంబు
అఖిలలోకేశ! నీ ♦ యాలయంబునకుఁబో
వలెఁగదా పాదము ♦ ల్గలఫలంబు

గీ. నీ మనోహర తులసినా ♦ నిప్రముదంబు
గాంచవలెఁగదా నాసిక ♦ గలఫలంబు
మంగళామంద! రక్షిత ♦ మౌనిబృంద!
యవిరళానంద! గోవింద! ♦ హరి! ముకుంద.

బిడ్డా! నీభక్తిచే నేనుగూడ తరించితిని.

శాంత : తండ్రీ! నేనజ్ఞానురాలను. నన్ను నుతింపవలదు. మీభక్తిచేతనే మీరు తరించితిరి.

ద్రోణు: స్వామీ! నీయది యేస్వరూపమోగాని, నీనోటిపై నెంగిలి యున్నది. కమలంబులంబోలు హస్తములందుగూడ నెంగిలి యున్నది.

కృష్ణు : ఈశాంత సీతారాముఁడను పంచముని కుమారుఁడగు శిష్యుఁడు మందిరపు బావిలో నీరు ముంచుకొనుటకుఁ ద్వరగాఁ బోవుచుండె. అదిగని యాతనితో వాదముబెంచె. దానిచేఁ గొంతసేపటికి నీరు దెచ్చి నివేదనజేసె. నాభక్తుఁడు నాయెంగిలిని శుభ్రముజేయును గాని, యంతలో నీమె నిశ్చలభక్తితో హారతినిచ్చెను. అందుచే నాభక్తుఁడు దినిపించుచుండగనే లేచి రావలసివచ్చినది.

ద్రోణు: చండాలుని గృహమునుండియా?

కృష్ణు : అవును. నీవిం దనుమానపడవలదు. మాకెల్లరును సమానులు. భక్తియే ప్రధానము.

ద్రోణు: అయినను వాఁడు నీచుఁడుగదా?

కృష్ణు : కులమువలనఁగాని కర్మవలనఁ గాదు. ఎవనికి మద్భక్తి యుండునో, వాఁడు మునితుల్యుఁడు. అట్టివారిచెంతనే నేనెప్పుడు నుందును. (అంతర్ధానమగును.)

ద్రోణు: ఆశ్చర్యముగ నున్నది. ఒక నీచునకు భగవత్పూజఁజేయ నధికారము గలదా ?

శాంత : ద్రౌపది యభిప్రాయముగూడ శ్రీకృష్ణుని యభిప్రాయమే. నీచుఁడు పూజించినను దోషములేదు. మీకు భగవానుఁడు తెల్పినకు దృప్తికాలేదా ?

ద్రోణు: ఎట్లు తృప్తియగును ? శూద్రులకు భగవంతుని బూజించు నధికారములేదు. హీనకులజుం డింతమాత్రమున నుత్తముం డెట్లగు ? భక్తుఁడైన యంత్యజుని యింటిలో బ్రాహ్మణులు నీరు ద్రావవచ్చునా? అయినను నింకఁ బాదుకలేల సిద్ధముఁజేయరాదు? కొంచెము సమయము చిక్కినప్పుడు దుర్యోధనునితోఁ జెప్పి వానినిరప్పించి వాని పూజాపీఠమును నదిలోఁ బాఱవేయించెద. (నిష్క్రమించును.)

శాంత : ఆహా ! శ్రీకృష్ణభగవానుని భక్తవాత్సల్యము !

గీ. పుష్పములలోన సైతము పూర్ణముగను
నిండెనే యెట్లుపూజింతు ♦ నే నటంచు
మానసంబున శంకింప ♦ దాని నిప్పు
దంతయుందీర్ప శౌరి ప్ర ♦ త్యక్షమయ్యె.

(నిష్క్రమించును.)

రంగము—యుద్ధభూమిలోని ధర్మజుని గుడారము

[ కృష్ణార్జున ధర్మజులు ప్రవేశింతురు ]

ధర్మ : శ్రీకృష్ణా! ధైర్య మెట్లు చెదరకుండును? తాతగారు తొమ్మిది దినములనుండి దయయనుమాట మఱచి ఘోరముగ మన సైన్యమును గూరకోఁత గోయుచున్నారు. అక్కటా! నేనేమిచేయుదు? ఎప్పుడు తొమ్మపై జేయిడి నిద్రింతు !

అర్జు : దండధరుఁడైన యముని గెల్వవచ్చును. వజ్రధారియైన యింద్రుని జయింపవచ్చును. శూలహస్తుఁడైన రుద్రుని నోడింపవచ్చును గాని, తాతగారిని గెల్చుట దుష్కరముగా నున్నది.

కృష్ణ : చూచితివా భీష్మపితామహుల బలమెట్లున్నదో! దేవతలనైన సులభముగ జయింపవచ్చునుగాని బాలబ్రహ్మచారిని వృద్ధదశలో గెల్చుట కడుంగడుఁ గష్టముగ నున్నది.

ధర్మ : మనమిపు డేమిచేయవలెనో తోఁపకున్నది.

కృష్ణ : ఆయన జీవించియుండునంతవఱకు నిట్లేయుండు.

అర్జు : అయిన మాతాతగారు మాయోటమికే యోజించునా? ఆయన జీవించుట మాయపజయముకొరకే యని యర్థమా?

కృష్ణ : అవును. ఆయన మరణంబునకును, మీవిజయంబునకును నొకటే యర్థము.

అర్జు : ఆయన యజయ్యుఁడు.

ధర్మ : ఉపాయ మేదైననున్న నానతిమ్ము.

కృష్ణ : అర్జునా! ద్రౌపది యన్నయైన శిఖండిని ముందిడుకొని నీవు యుద్ధమొనర్పుము.

అర్జు : ఇది యేమి రహస్యము?

కృష్ణ : ఏమియులేదు. ముందు విచారింపవచ్చు. సేనకు నేఁడు ముందుగా శిఖండిని నిల్వఁబెట్టుము.

ధర్మ : మంచిది. అట్లే గావింతము. (అందరు నిష్క్రమింతురు.)

రంగము — యుద్ధభూమి

[ భీష్మార్జునులు ప్రవేశింతురు ]

భీష్మ : (మహాసంతోషముతో) అర్జునా! అర్జునా!

శా. ఆయాసంబు శమించె మెచ్చితిని నీ • యత్యద్భుతాస్త్రప్రయో
గాయత్తత్వము వంశగౌరవము నా • హా! నిర్వృతివింక నీ
కీ యుద్ధంబునఁగాదు భూమిపయి లే • నేలేదు సామ్యంబు, దీ
ర్ఘాయుష్మంతుఁడవై సుఖింపడుము వ • త్సా! న్యాయ్యమార్గంబునన్.

అర్జు : పితామహా! యీశరాసారము నాదికాదు; శిఖండిది.

భీష్మ : నీవు చెప్పనక్కరలేదు. నేనంతయు నెఱుఁగుదు.

శా. సత్సాంగత్యము న్యాయ్యము న్వినయమున్ ♦ సత్యంబు ధర్మంబు నీ
రోత్సాహంబును పండితావనగుణం ♦ బోర్పున్ వదాన్యత్వ, ము
ద్యత్సాధుత్వము త్వత్పరాక్రమసహా ♦ ధ్యాయత్వములావెయో
వత్సా! యియ్యవి నే నెఱుంగనివె నీ ♦ బాల్యాది నీనాఁటికిన్.

అర్జు : పితామహా! యియ్యది యుద్ధభూమి. నేను శత్రుఁడను; నన్నేల యగ్గించెదవు? ఇదియుంగాక యీ శరాసారము నాయదియే యని యెట్లు నిర్ధారణ పరుపవచ్చును.

భీష్మ : వత్సా !

ఉ. ఎందుల కిట్లుదాచెద వ ♦ హీనపరాక్రమ ! నీవుదక్క నీ
చందమున న్శరంబుగొని ♦ సంగరమందు మదీయసైన్యముల్
చిందరవందరై పరచి ♦ చెట్టుల గుట్టల నాశ్రయించి సం
క్రందనపుత్త్ర! గావుమను ♦ కైవడిఁ జేయఁగలారె చెప్పుమా.

ఇంతియేగాక,

చ. అతికఠినంబులై శితము ♦ లై దృఢముక్తములై ప్రదీపితా
కృతులయి లక్ష్యశుద్ధిగల ♦ యీ శరముల్ విజితాంబికేశుఁడై
హతసకలాదివీరవరుఁ ♦ డై తగు నీవియగాక భీతిసం
గతుఁడు శిఖండి వెన్నటికి ♦ గావుసుమీ శతజన్మలెత్తినన్.

దుర్యో: (ప్రవే) ఎంతఘోర మెంతఘోరము! (తెరవంక జూచుచుఁ జేయెత్తి)

శా. ఏదో మాయనుబన్ని యీ దినమునం ♦ దే, యెంచకే చిత్తమం
దేదోసంబును హా! పితామహుని వీ ♦ డీల్గింపనున్నాఁడు రా
రా దుశ్శాసన! రమ్ము ద్రోణతనయా! ♦ రావయ్య యాచార్య! అ
న్నా! దిక్కుల్గనువారెకాని యెక్కరై ♦ నన్ రారిదేమక్కటా!

(ముందునకుఁ జూచి) వారిని భీమాదు లడ్డగించిరి. కానిమ్ము నేనే వీని నాఁపెద. (అర్జునితో)

చ. నిలునిలు మెందుఁబోయెదవు ♦ నెమ్మది నన్నొక పూచికపుల్లఁగాఁ
దలఁచితివేమొ? కన్నులకుఁ, దట్టిన గర్వము దింతుఁజూడు ము
జ్జ్వలతల మీ గదాయుధము ♦ చంపక సైఁపదు నిన్ను నింక న
మ్మూలఁ బరపింపుమీ సమర ♦ భూమినిఁ జూచెదఁగాక తాతపై.

అర్జు : ఇదిగో నీ దుష్కృత్యఫలం బనుభవింపుము. (బాణమువేయ దుర్యోధనుఁడు మూర్ఛిల్లును.)

భీష్మ : (నవ్వి) దుర్యోధనుని పనియైనది. అప్పుడే మూర్ఛిల్లె. అడుగో నర్జునుఁడు మరల విజృంభించుచున్నాఁడు.

అర్జు : (భీష్మునిపై బాణములువేయును. భీష్ముఁడు తూర్పుదిక్కుగా శరములే శయ్యగాఁ బడును. దుఃఖముతోఁ జెంతజేరి) అయ్యో తాతా! అయ్యో తాతా!

సీ. మానుగ మము తండ్రి ♦ లేని బిడ్డలటంచుఁ
జెంతకుఁదీసి ర ♦ క్షించితివు
ఏరాత్రి నేపగ ♦ లేదికోరినఁగాని
విసుగక వాని ని ♦ ప్పించితీవు
ఆడని కే మేగు న ♦ ప్పుడు గోడుగోడునఁ
జిఁతించి చాలఁ గృ ♦ శించితీవు
మేము తిన్నఁగనున్న ♦ మేల్వార్తవిని మనం
బునను గొండంత యు ♦ ప్పొంగితీవు

గీ. గురునిరప్పించి విద్యల ♦ గరపితీవు
అతికఠినవృత్తిఁబూని యు ♦ య్యయ్యొ! యెంత
ఘోర మెంతఘోరము చేతు ♦ లారఁ బాడు
గయ్యమునఁ జంపుకొంటి తా ♦ తయ్య నిన్ను.

(తెరలో) మహాత్మా! కురుపితామహా!

గీ. దక్షిణాయన మియ్యది ♦ తనువు విడువఁ
జనదు దివ్యర్షులము మేము ♦ వినుచుచుంటి
ముత్తరాయణమగుదాఁక ♦ నుండి యావ
యిని ననంతపరంధామ ♦ మేగుమయ్య.

భీష్మ : (విని) ఆహా! మహర్షులకునాయందెంతదయ! (ప్రకా) అంతరిక్ష గతులగు నో మహర్షులారా! మీయాజ్ఞను శిరసావహించితిని.

దుర్యో: (లేచి భీష్మునిఁజూచి) అయ్యో తాతా! మమ్ము విడిచి పోయెదవా? (దుఃఖించును.)

భీష్మ : నాయనా! సుయోధనా! దుఃఖింపకుము. ఇంకనైనఁ బాండవులతో సంధిగావింపుము.

దుర్యో: ఇదివరకే నామనోనిశ్చయమును దమ కెఱింగించితిని. నన్ను క్షమింపుఁడు.

భీష్మ : (తనలో) ఆహా! యేమి వీనిమౌఢ్యము? శక్తికొలంది బోధించి చూచితినిగాని కార్యములేకపోయెను. అయినను గాండీవిపరాక్రమ మిప్పుడితనికిఁ దేటతెల్లముగావించెదఁగాక! (ప్రకా) సుయోధనా! నీయిష్టము. నా శిరమున కొత్తిడి తగులుచున్నది. తలగడ!

దుర్యో: చిత్తము. (మెత్తని పట్టుదిండ్లను దెప్పించును.)

భీష్మ : (నవ్వి) వత్సా! అర్జునా! తలగడ. తలగడ.

అర్జు : చిత్తము. (అని భీష్మునితలకు బాణములఁ గొట్టును) తాతా! క్షమింపుము. (పాదములంబడును.)

భీష్మ : దుర్యోధనా! దప్పియగుచున్నది.

దుర్యో: (శుద్ధోదకముఁదెచ్చి) తాతా! యిదిగో!

భీష్మ : (నవ్వి) శరతల్పగతుఁడనగు నే నీ యుదకమును బుచ్చుకొనను. (అర్జునునితో) అర్జునా! నీవు నాకు దప్పిదీర్చెదవా?

అర్జు : చిత్తము. (అస్త్రమెక్కుపెట్టి) తల్లీ ! భూదేవీ !

సీ. ఖలుల దుష్కార్యముల్ ♦ క్షమించుటంజేసి
క్షమ యనంగఁ బ్రసిద్ధి ♦ గాంచినావు
క్రమతఁ గుమార ర ♦ త్నములఁ గాంచుటఁజేసి
రత్నగర్భయనంగఁ ♦ బ్రబలినావు
సత్యోక్తిక్షణమైనఁ ♦ జలియింపకుంటచే
నచలయనంగఁ బే ♦ రందినావు
దీనరక్షణమందు ♦ స్థిరచిత్తవై యుంట
స్థిరయనన్ బ్రఖ్యాతిఁ ♦ జెందినావు

గీ. తాత కుపచారము లొనర్పఁ ♦ దగిన సమయ
మబ్బెఁగావున నింక నా ♦ యస్త్రమునకు
త్రోవనిడి మత్కృతజ్ఞతా ♦ భావితామి
తంబులగు జోహారుల గొనం ♦ దగునుతల్లి.

(అని బాణము వేయును. గంగ పైకివచ్చును.)

అర్జు : (మహాభక్తితో)

గీ. ఖలుఁడనై కృతఘ్నుఁడనయి ♦ కలుషకలిత
మానసుఁడనై దురంబున ♦ మాననీయుఁ
దాత నొంచిన పరమ కి ♦ రాతు నన్ను
నహహ! క్షమియించినావు సూ ♦ యవ్వ గంగ !

(అని గంగోదకముఁదెచ్చి భీష్మన కొసంగును.)

భీష్మ : (త్రాగి) అర్జునా: సంతృప్తుఁడనైతి. దప్పితీరినది. సుయోధనా! చూచితివా ! యేల యూరక చెదెదవు ? సంధిగావింపుము.

దుర్యో: తాతా! యెన్ని మారులు చెప్పవలయును ?

భీష్మ : పోనిమ్ము. నీకర్మము నీవే యనుభవింతువు. ఇంక మీమీపనులు చూచుకొండు.

.(అందరు నిష్క్రమింతురు - తెరవ్రాలును)

# కురుక్షేత్రము

## [ అను సంపూర్ణ మహాభారతం ]

## షష్ఠాంకము

రంగము — దుర్యోధనుని గుడారము.

[ ద్రోణ-దుర్యోధనులు ప్రవేశింతురు ]

ద్రోణు: ఇవియన్నియు నిజమేకాని నా చిత్తము వ్యాకులమైయున్నది. ఇట్టితఱి నేను సేనాధిపతినగుట కిష్టపడను.

దుర్యో: ఆచార్యా! పితామహు లంపశయ్యనుండ మీకన్న సమర్థులెవ్వరు?

ద్రోణు: ఎంతవఱకు కా చండాలుని పూజాపీఠము నదిలోఁ బారవేయింపవో అంతవఱకును నా చిత్తము కుదుటఁబడదు. ఎంత గర్వమో చూడుము! తోలుసంచులతో గంగోదకమును దెచ్చుటయేగాక విష్ణుపూజయునా? ఎంతవిపరీతము! ఇట్టివారిని సహించి యుపేక్షించిన నింక సౌధగవాక్షములకుఁ జర్మాచ్ఛాదనము సంభవింపదా?

దుర్యో: గురువర్యా! శాంతింపుము. మీరు బ్రాహ్మణులరు. సర్వకులములకు శిరస్సువంటివారు. ఇట్టి మీ యెదుట నా పంచముఁడెంత? ఈ దినమునుండి భగవత్పూజ సేయఁడు. మీ యాజ్ఞ కెవరెదురె చెప్పుదురు? (తెరవంకఁజూచి) ఎవరురా అక్కడ!

సేవ : (ప్రవే) మహారాజా! యేమియాజ్ఞ?

దుర్యో: నీవు చని సీతారాముఁడను పంచముని బూజాపీఠముతోఁగూడ నదియొద్దకుఁ దోడ్కొనిరమ్ము. (సేవకుఁడు.నిష్క్ర) ఆచార్యా: యింక మనము నదియొద్దకే పోయి సవిగ్రహముగ వాఁడు పూజాపీఠమును నదిలోఁ బారవేయుచుండఁ జూతమురండు.

ద్రోణు: మంచిది. ( నిష్క్రమింతురు)

రంగము — గంగానది

[ద్రోణ దుర్యోధనులు, సీతారాముఁడు, శివుఁడు, మరికొందఱు అంత్యజులు ప్రవేశింతురు. ]

దుర్యో: సీతారాముఁడా! నిన్నెవ్వరిక్కడకు రప్పించిరో యెఱుంగుదువా?

సీతా: అన్నదానపరాయణా! నాభాగ్యమే నన్నిక్కడకురప్పించెను. ఆహా!

గీ. విమలభాగీరథీదర్శ ♦ నమునుజేయఁ
గంటి తొల్లింటి పున్నెము ♦ కతన మీయ
నుగ్రహంబున నింక ధ ♦ న్యుఁడను పావ
నుండనైతిని దపమునుఁ ♦ బండెనేఁడు.

ద్రోణు: ఈమాటలకేమిగాని నీవిచ్చటి కెందులకు వచ్చితివో ముందు దానిని గుర్తింపుము.

సీతా : నాకుఁ దెలియును. రారాజుగారు హరిభజనము వినుటకై నన్ను రప్పించిరి. నేను దాని నిప్పుడే ప్రారంభించెద.

శివుఁ : నేనుగూడగానముఁజేసెద. నాట్యముగావించెద. హరినిమెప్పించెద.

ద్రోణు: సర్పమునకు విషవిహీనమగుసంతానము జనించునా ?

సీతా: అందఱును బాడుఁడు. (అనిపాటలందిచ్చును. అందరుపాడుదురు.)

ద్రోణు: చాలుఁజాలు నూరకొనుఁడు. నిష్కళంకమగు హరినామమునకుఁ గళంకము దెచ్చిపెట్టకుఁడు. ఓరీ : మీకు హరిపూజ సేయుమని యెవరాజ్ఞయిచ్చిరి ?

సీతా : మహాత్మా ! మీవంటిపెద్దలే.

ద్రోణు: మావంటి పెద్దలా ?

సీతా : అవును దేవరా !

గీ. బావివలన గుంభంబు కుం ♦ భంబువలన
మానవులు జలముగ్గొంత్రు ♦ మహిని నట్లె
శ్రుతులవలన బెద్దలు వారి ♦ కతన నీచు
లైన మేమును బూజింతు ♦ మయ్య హరిని.

దుర్యో: (పంచములజెండాఁ జూచి) ఈధ్వజముపై నేమివ్రాసినారు ?

సీతా : గీ॰ ఉగ్రకిరణునియందుండ ♦ యోగిహృదయ
మందునుండ వైకుంఠము ♦ నందునుండ
నారదా ! భక్తవరులు గా ♦ నంబుసేయు
చుందు రెచ్చట నే నట ♦ నుండువాఁడ.

ద్రోణు: ఓరీ చండాలుఁడా! భగవద్వాక్యము నపవిత్రము జేసితివేమిరా ?

దుర్యో: ఈ ధ్వజ ముండఁగూడదు.

ద్రోణు: ఓరీ: మీరు పంచములనియనుకొనరా? మీకిట్టి మహావాక్యములఁ
జదువ నధికారముగలదా ? ఈ యధికార మెవరిచ్చిరి ?

సీతా : ఈమహావాక్యమే యిందుఁ బరమాత్మ తన భక్తునిచెంత నుందు
నని చెప్పుచున్నాఁడు. హరిభజనమున కెల్లవారికి నధికారము
గలదు.

దుర్యో: ఓరీ నీచుఁడా ! నోరుమూయుము.

ద్రోణు: ఇంకేమున్నది! బ్రాహ్మణ్యము పాడైపోయినది.

సీతా : అఖిలేశ్వరుఁడు నాయజమాని. నాతండ్రియు నతఁడే. తండ్రికిఁ
గొందఱు చిన్నవారును, గొందఱు పెద్దవారును గొడుకులుందురు.
వా రందఱియందు నతనికి సమానప్రేమయేగదా ?

ద్రోణు: తండ్రి సొమ్మంతయుఁ దెలివికలవారికే చెందునుగాని, పిచ్చి
వారికిఁ జెందదు.

సీతా : మహాత్మా : నిజము చెప్పితిరి. పిచ్చివానికిరానేరదు. కాని తండ్రి
ధన మేరీతిగా వ్యయముఁజేయవలయునో యది యెఱిఁగినవాఁడు
కాఁడు. నేను తండ్రియైన శ్రీకృష్ణుని భజనయను ధనమును
జగజ్జనులకై చక్కఁగా వ్యయముఁజేయుచున్నవాఁడను.

దుర్యో: మీరు నీచులు. కావునఁ జేయఁదగరు.

సీతా : అన్నదానపరాయణా! కులము మర్యాదకొఱ కేర్పడిన నేర్పడుఁ
గాని యీయనప్రేమ యొకరికై గాదు. సమస్తజనుల కుపయోగ
పడవలయును.

గీ. దేవదేవుఁడౌ శ్రీవాసు ♦ దేవు ప్రేమ
యఖిలజనులకు నుపయోగ ♦ మౌటకొఱకె
వసుధలోన సూర్యాచంద్ర ♦ మఋల కిరణ
కాంతి యెల్ల రనుభవింపఁ ♦ గాదె తండ్రి.

దుర్యో: (కోపముతో) ఇంక మీ ప్రసంగమును గట్టిపెట్టుఁడు. ఎవ్వ రీ దినమునుండి జీవింపనెంతురో వారు తమ పూజాద్రవ్యములను విగ్రహములను నీ గంగలోఁ బారవేయుఁడుఁ

సీతా : (దుఃఖముతో) ఓ మహారాజా! యింకేదైన శిక్ష విధింపుము కాని భగవంతుని గంగలోఁ గల్పుమనిమాత్రము నిర్బంధింపకుము.

మ. కమలాక్షున్ నదిఁ బాఱవేసెను విధి ♦ స్థావించి దుఃఖమ్ము పెం
చి మనస్తాపము గూర్పఁబోకుము మమున్ ♦ శిక్షింపఁగా నెంతువే
ని మరేదైన విధింపుమయ్య యిఁక నన్ ♦ జీవింపకుండం బొన
ర్పుము నా చర్మముచేత వేగముగఁ జె ♦ ప్పుల్గుట్టఁగాఁ జేయుమా.

దుర్యో: ఓరీ: మాటలాడక దేవతాపీఠమును నదిలోఁ బారవేయుము.
సీతా : (దుఃఖముతో) ఓ మహారాజా ! నన్ను క్షమింపుఁడు. కృష్ణుఁడు నా బంధుగు. అపచారములేకుండ నట్టి బందుగు నవమానింపలేను. నే నతనిని వదలినను నన్నా మహాత్ముఁడు వదలఁడు.

దుర్యో: ఓరీ ! మాటలాడక దెవతాపీఠమును నదిలోఁ బారవేయుము.
సీతా : మహారాజా ! యిందాశ్చర్యమేమున్నది? ఆ మహానుభావుం డంత భక్త సులభుఁడు.

దుర్యో: ఓరీ ! నీ వజ్ఞానివి. కానిపోనిమాట లాడుచుంటివి.

సీతా : గీ. నన్ను గన్న తండ్రిని పద్మ ♦ నాభుఁ గంస
గర్వహరణు మహాత్ముని ♦ గంగయందు
మీరలెల్లరుఁ జూడగాఁ ♦ బాఱవైచి
రమ్మటందును వచ్చునొ ♦ రాఁడొ కనుఁడు.

దుర్యో: ఏమీ ! గంగలోనుండి బయలు వెడలివచ్చునా ?

సీతా : అవునతండ్రీ గంగలోనుండియే వచ్చును. మున్ను ప్రహ్లాదుని రక్షింప స్తంభమునుండి వచ్చెననుమాట సత్యమేని యిప్పుడేల రాకుండును?

దుర్యో: నీకు నమ్మకమేనా?

సీతా : ఆ! నమ్మకమే. ఆయన భక్తవత్సలుఁడు. నామాట చెవినిబడిన వెంటనే రాఁగలఁడు.

దుర్యో: భక్తియే ప్రధానముగాని కులగోత్రములతోఁ బనిలేదని చెప్పుచుంటివి. మా ద్రోణాచార్యులవారును నీవును బిలువఁ డెవ్వరు పిలిచిన వచ్చునో చూచెద.

సీతా : ద్రోణాచార్యులవారు భక్తులుగారని నేననలేదు. వారే నాకన్న భక్తులైన వారిచెంతకే వచ్చును.

ద్రో-దు: ఈ పద్ధతికి ముమ్మాటికి సమ్మతించెదవా?

సీతా : సిద్ధముగా నుంటిని.

దుర్యో: (అప) ఏమి యాచార్యా! మీ యభిప్రాయము?

ద్రోణా: (అప) ఓయీ: నీవెందుల కాలోచించెదవు? వీనికి భగవంతుఁడు సాక్షాత్కరించునా? సత్కులీనుఁడను నాకేదర్శనమిచ్చును. మరియు-

గీ. అగ్రవర్ణంబునం బుట్టి ♦ నట్టినాకు
గోచరుఁడుగాక శ్రీహరి ♦ నీచవంశ
జనితునకు కనఁబడునె రా ♦ జకులచంద్ర!
కస్తురిని వీడి పంకము ♦ గాంచుకరణి.

సీతా : (తనలో) ఓ భగవంతుఁడా! నే నతిదుఃఖితుఁడనై దుర్బలుఁడనై యున్నవాఁడ. ఈ దీనునియందు దయయుంచుము. ఎల్లప్పుడు ప్రాణసమానుండవని యేనేత్రములతో నిన్ను సేవింతునో అట్టినేనే.

గీ. ఇట్టె యొకరీతిఁ బంతము ♦ బట్టియున్న
వారు ద్రోణ దుర్యోధను ♦ ల్వారికతనఁ
జింతతో నిన్ను నేఁడు నా ♦ చేతులార
గంగలో వేయుచుంటి న ♦ న్గన్నతండ్రి!

నన్ను క్షమింపుము. నాకెక్కుడు కష్టము రానీయకుము. నేను పరాభవంబును సహింపలేను.

దుర్యో: నీవిప్పుడే దేవతాపీఠమును గంగలోఁ బారవేయుము.

సీతా : (విగ్రహముచుట్టు ప్రదక్షిణము సేయుచు) ఓయనంతకల్యాణ గుణ రత్నాకరా : తాండవకృష్ణా !

సీ. చలినీట మున్గిన ♦ శైత్యముపట్టునే
మో? యింక నేనేమి ♦ సేయువాఁడ
ఆహార మనుబుద్ధి ♦ నల్గి యే మొసలి ని
న్బట్టునో? నేఁగూడ ♦ వచ్చువాఁడ
విడనాడి పోయెద ♦ వేమొ? నన్జంపుకొ
న్నట్టు నీకయి యింక ♦ నరయువాఁడ
కౌమరితపైఁగల ♦ కూర్మిచే మిక్కిలి
తడయకు మటులైన ♦ మడియువాఁడ

గీ. తనయు మరువకుమయ్యా నా ♦ తండ్రి నాకుఁ
గల్గు సర్వస్వ మీవె నీ ♦ కన్న వేరు
చింతయే లేదుసుమ్ము నా ♦ చిన్ని కృష్ణ !
తిన్నఁగా బిడ్డకడకేగి ♦ తిరిగిరమ్ము.

(విగ్రహమును గంగలో విడువలేక విడువలేక విడుచును.)

ద్రోణు: ఓరీ యంత్యజులారా! మీరందఱు దూరముగఁ బొండు. ఈ యపరిశుద్ధ స్థలంబును బవిత్రముజేసి భగవంతునిఁ బిలిచెద. (అట్లుచేసి మంత్రములఁ జదువుచు)—

మ. కరిరక్షించుట లెక్కగాదు కుమతి ♦ న్గాకాసురుంగాచుటే
పరువుంగాదు విరోధి నుక్కడఁచి యా ♦ ప్రహ్లాదునింబ్రోచు టం
తకువుండు న్వీను మగ్రవర్ణమహిమన్ ♦ స్థాపింప నిచ్చోట ని
త్తఱిఁ బ్రత్యక్షముగమ్ము దైత్యసార స ♦ త్యానాథ! నారాయణా!

(అని యనేక విధముల ప్రార్థించును.)

దుర్యో: (ఆశ్చర్యముతో) ఆచార్యా! ఆశ్చర్యముగనున్నది. మీకష్ట మంతయు వృథయైనది. మీ యా వాహనాది షోడశోపచారంబులును వ్యర్థములైనవి.

ద్రోణు: దుర్యోధనా! పీఠము పై కిరానంతమాత్రమున మమ్ముఁ దిరస్కరింపఁ దగదు. లఘువస్తువు లెప్పుడును నీటిపైఁ దేలును. విగ్రహము లోహసంబంధమగుటచేఁ బైకిఁ దేలకున్న దిందు విస్మయమేమున్నది. మాయావాహనాదులే పనికిరానిచో బ్రహ్మయు నిందు వ్యర్థుఁడే.

దుర్యో: ఓరీ సీతారాముఁడా! నీవు పిల్వుము. వచ్చునేమో చూతము.

సీతా: చిత్తము. (చేతులు జోడించి) తండ్రీ! తాండవకృష్ణా! చిన్నికృష్ణా! భక్తవత్సలా!

మ. ఖలుఁడన్ దుష్టుఁడ జాతిహీనుఁడ మహా ♦ కార్పణ్యయుక్తుండ దు
ర్బలుఁడన్ హీనుఁడఁ బాలసుండ జడుఁడన్ ♦ బాపక్రియారంభుఁడన్
గలుషస్వాంతుఁడ నీచుఁడన్ నిముసమై ♦ నన్ నిన్విడంజాల నా
కెలనం గన్పడుమయ్య మ్రొక్కెదను శ్రీ ♦ కృష్ణా! జగన్నాయకా!

(అంతట నీటిలోనుండి మొసలియు, మొసలిపై స్త్రీవేషధారిణియగు గంగయు, గంగ హస్తంబున శ్రీకృష్ణ విగ్రహంబును గన్పడును. సంతోషముతోఁ జేతులెత్తి పిలుచుచు) తండ్రీ: రమ్మ రమ్మ.

సీ. మకరిచేఁబడి పలు ♦ మారు వేఁడిన గజేం
ద్రుని బ్రోచినట్టి ము ♦ ద్దులముకుంద!
చత్రాతియై వన ♦ స్థలిఁ బడియున్న య
హల్యనేలిన వర ♦ హాలతండ్రి!
చెలియలికిన్ వస్త్ర ♦ ములనిచ్చి రక్షించు
కొన్నట్టి మాయల ♦ గొల్లవాఁడ!
నందుని వేషమున్ ♦ ధరియించి యతని నీ
లోఁ జేర్చుకొనిన యో ♦ లోకనాథ!

గీ. అధమ వంశజుఁడని సంశ ♦ యంబు గొనక
చెలగి ప్రత్యక్షమైన మా ♦ చిన్నెలయ్య !
రమ్ము నాయంక మెక్కుము ♦ నమ్మినట్టి
వీనిపై దయయుంచు మో ♦ విమలచరిత !

(శ్రీకృష్ణ విగ్రహమువచ్చి యొడిలోఁ గూర్చుండును. పుష్పవృష్టి గురియును.)

ద్రోణా: (గంగవైపుతిరిగి చేతులుజోడించి) అమ్మా ! భాగీరథీ ! యీ మా సందేహము దీర్పుము.

గంగ : ఏ సందేహము ?

ద్రోణా: ఎవ్వరికి యుగచతుష్టయమునందును మాన్యతగలదో భగవంతుని వక్షంబుననైత మెవ్వరి పాదచిహ్నములుగలవో యట్టిబ్రాహ్మణులఁ బరాభవించి శ్రీహరి పంచము నాదరించుటేమి ?

గంగ : భారద్వాజా ! శాంతింపుము. మునులకన్న నిశ్చలభక్తిగల యీ మహాభక్తుని యెదుటఁ దలవంపుము. నిస్సందేహముగా నీవు బ్రాహ్మణుఁడవు. కాని క్రోధమువలనఁ దెలియకుంటివి. భగవంతుఁడు నీ కొక్కనికే స్వాధీనుఁడై యుండునని యహంకరించుట బ్రాహ్మణ లక్షణమా !

ద్రోణా: (ఊరక వినుచుండును)

గంగ : నీవు మాతృగర్భమునుండి పుత్త్రప్రేమవలన నేర్పడినవాఁడవు కావు. నీ ప్రత్యంగంబులును గామాగ్నిచే నేర్పడినవి. కావుననే యిప్పటికిని భ్రమయను వలలోఁ జిక్కియుంటివి.

ద్రోణా: ఎట్లెట్లు ?

గంగ : రంభనుగాంచి నీ తండ్రి కామాధీనుఁడయ్యె. అంత నమ్మహాత్మునకు రేతస్స్ఖలనమయ్యె, అందుచే నింతైనది. ఆ విషయము పోనిమ్ము.

ద్రోణా: అవునుతల్లీ ! అదియే కారణము. నాకీ భక్తునిపై ద్రోహచింత గల్గుట కదియే మూలము.

గంగ : నిజమెఱుఁగుటయు శాంతివహించుటయు విద్య కలంకారములు.

ద్రోణు: అమ్మా ! నీయానతి శిరసావహించెద. అమ్మహాత్ముని పాదములపై వ్రాలెద.

గంగ : అక్కఱలేదు. పశ్చాత్తాపముచేత నే శుద్ధుఁడవైతివి.

దుర్యో: అమ్మా! మా గురువర్యుల నిట్లు చేసితివేమి ?

గంగ : కౌరవేశ్వరా ! యీరహస్య మతికష్టము. దీనికై దివ్యదృష్టి కావలయు. అయిన నీసందేహము నివారింపఁజేసెద. ఇతఁడు రామానందతీర్థుల శిష్యుఁడు. సద్బ్రాహ్మణుఁడు. శాపముచేత నీనీచవంశమున జనించె. (అని దివ్యదృష్టి నిచ్చును.)

దుర్యో: (చూచి ఆశ్చర్యముతో) ధన్యోస్మి ! ధన్యోస్మి !

గంగ : కత్తి దీసికొనుము. ఇంకొక తార్కాణముఁజూపెద.

దుర్యో: (కత్తిగొని) అమ్మా ! యిదిగోఁ గత్తి.

గంగ : ఇతని పొట్టఁ జీల్చుము.

దుర్యో: (చీల్చి యజ్ఞోపవీతమును జూచి) అమ్మా ! నా పాపంబులు పటాపంచలైనవి.

గంగ : ఎప్పుడును భక్తుల కపకార మొనర్పకుము. (అంతర్ధానమగును)

దుర్యో: మహాత్మా ! సీతారామా : యింక నీవు పూజాద్రవ్యములతో భగవంతుని గైకొని యింటికేగుము. (ద్రోణునితో) ఆచార్యా : యిక్కడ మన మూరకుండనేల ? యుద్ధ విషయములంగూర్చి విచారింతము రండు. (అని యందఱు నిష్క్రమింతురు.)

రంగము — అరణ్యభూమి

[ తర్వాత వీరావేశముతో అశ్వత్థామ ప్రవేశించును. హుంకారముసేయుచు ]

మ. స్ఫురదస్మద్భుజదండ శరముల్ ♦ పుంఖానుపుంఖంబుగా
నరిసేనం దునుమాడువేళ హరి లే ♦ నట్టైన నప్పట్లను
ద్ధురనారాయణ కిలకిలల మరు ♦ త్పూనుండు హాహారవ
స్ఫురణ బొప్పఁగ గూలకున్నె శలభం ♦ బుం బోలె నాలంభునన్.

మాయాయుద్ధమునఁ బాండవేయులు మాతండ్రిని వధించినందు లకుఁ బ్రతీకారముం గాంచితి. నాకష్టము ఫలించె. నాజనకుని యొక్కొక్క రక్తబిందువున కొక్కొక్క శవము లేచినది. అట్టు లాకసమునకెగిరి ఆచార్యా ఆచార్యా యని మజ్జనకుని నామంబును జపించె. మెరుపుతీగెవంటి యుపపాండవ పంచకము నా ఖడ్గధార కెరయయ్యె. (ముందుజూచి) ధర్మజుఁడును,భీముఁడును దుఃఖము పెనగొన నిటే వచ్చుచున్నారు. వచ్చెదరుగాక: వీరిసంగతిగూడ కొంచెమువిచారింపవలయు. (అనియొకచెట్టుక్రిందగూర్చుండును.)

ధర్మ : (భీమునితోఁబ్రవే) భీమా! అశ్వత్థామ చంపెననియే నీకు దృఢ నిశ్చయము గలదా ?

భీము : ద్రౌపది బాగుగ గుర్తించి నాకుఁ జెప్పినది. దొంగయై వచ్చి నిద్రాణుల వధించి మనకుఁ దెలియక మానదనియు నందుచేఁ గష్టము సంభవించుననియు నెంచి యెచటికో పాఱిపోయెను.

అశ్వ : (ముందుకువచ్చి) ఓరీ భీమా : అశ్వత్థామ పాఱిపోలేదురా !

చ. జననమునొంది పెద్దనయి ♦ జ్ఞానముఁ గాంచిననాఁటనుండి యే
జనపతి యన్నముందిని ప్ర ♦ శస్తిని గంటినొ ధాత్రి నా సుయో
ధనుని ఋణంబు దీర్ప భుజ ♦ దండ లసచ్ఛరవహ్నిచేత మీ
తనయులఁగాల్చు నియ్యరివి ♦ దారణదక్షుని ద్రౌణిఁ గాంచుఁడీ.

భీము : (కోపముతో) ఓబ్రాహ్మణకులకళంకా! గురువుపేరు మాపితివి. నీవే చెప్పుము. ఈకృత్యము ధర్మము ననుసరించియున్నదా ?

ధర్మ : అర్ధరాత్రమందు నిద్రాణుల వధింపుమని నీతండ్రి నీకెప్పుడు నేర్పెను ?

అశ్వ : (నవ్వి) ఓ అధర్మపరాయణా ! చాలు నూరకొనుము. నా కుపదేశించుచుంటివా ! న్యాయముగ నాచార్యుని జయింపలేక యసత్యమాడుమని నీకెప్పుడు నేర్పెను? ఓఅసత్యవాక్కల్పనా పండితా : భీష్మానంతరమున సేనాధిపతిత్వమున కొప్పుకొని యుద్ధము సేయుచుండ వారిని జయింపలేక మొద టశ్వత్థామ

హతుఁడయ్యెననిచెప్పి పిమ్మట కుంజరంబని యమ్మహాత్ముని పొరబెట్టుట ధర్మమా ! ప్రాయోపవేశము గావించి జీవంబులను విడిచిన తండ్రిగారి మృతకళేబరంబును ధృష్టద్యుమ్నుఁడు గోయు చుండఁ జూచి యుపేక్షించుట ధర్మమా ? అప్పుడే యివి యన్నియును మరపుబట్టెనా ?

భీము : ధర్మవేత్తవయ్యును నిద్రాణుల వధించితివి.

అశ్వ : అట్లుకాదు. లేపియే చంపితిని.

భీము : అన్యాయమైన యీ కార్యమునకు మారు నీ శిరమైనను లేక నీ శిరోరత్నమైనను దీయవలయును.

అశ్వ : నాచిత్తము విరక్తిఁ జెందినది. ఇప్పుడు నాశిరము పోయినను జింతలేదు. ఇదిగో నిప్పుడే యీమణినిఁ దీసివేసెద. (అని మణి నిచ్చి నిష్క్రమించును.)

ధర్మ : ఈమణిని ద్రౌపదికిత్తము రమ్ము. (అని అందఱు నిష్క్ర)

రంగము — అరణ్యమార్గము

[ తర్వాత ధర్మరాజును, మహేంద్రుడును ప్రవేశింతురు ]

మహే: ధర్మరాజా: యీవృథావాదమును వదలుము. యుద్ధపరిలబ్ధమైన రాజ్యమ్మును విసర్జించియు, మహావిధేయులగు నల్వురు తమ్ములను ద్యజించియు, సహధర్మచారిణియగు భార్యను బరిత్యజించియు నీ శునకమును వీడుటకు సంశయించెదవేమి ?

ధర్మ : దేవరాజా: క్షత్రియధర్మస్థాపనమునకే రాజ్య మార్జించితిని. అది యున్ననేమి పోయిననేమి ?

ఇంద్రు: ఇది తమ్ములకన్న నెక్కుడు ప్రేమాస్పదమైనది కాదుగదా.

ధర్మ : తమ్ములను నేను విడువలేదు. హిమాలయపు మంచుకరళ్ళు ద్రింగిపోయినవి.

ఇంద్రు: ఈశ్వరునిమాయ యిట్టిదే. కాని ధర్మనందనా! నీవు నీయుత్తమ కర్మవలన స్వర్గమునకుం బోవుచుంటివి. కాని శునక మెట్లరుగ నర్హమగును ?

ధర్మ : అయిన నన్ను నమ్మి వచ్చు సేవకుని విడిచి స్వర్గమరుగుట కిష్టపడను. ఈ శ్వానమును విడుచుటకన్న స్వర్గమును విడుచుటయే మేలు.

ఇంద్రుః ధర్మరాజా: స్వర్గము కుక్కలకు నిలయముగాదు. శునకము మహామాలిన్యముగలది. అపవిత్రమైనది. మురిగిపోయిన మాంసము, నెముకను విడువదు ; అల్పబుద్ధిగలది. బంధువులకు బంధువుగాదు. కఠినచిత్తము గలది.

ధర్మ : అట్లుగాదు. ఎవరి యుప్పుపులుసు దినునో వారిని వదలదు. కుక్కవంటి నమ్మకమైన సేవకుఁ డింకొకఁడు లేడు. శునకము తన యజమానునికొఱ కాకలిదప్పులను లెక్కసేయదు. అధిపతిని వెన్నంటి కాపాడును. తన మరణమునకును వెఱవదు.

గీ. తమరు సుఖమందనెంచి వి ♦ త్తంబుగల్గు
దాఁక సేవించి యాపయిం ♦ దలఁపఁబోరు
కొందఱు దురంతరంగు లా ♦ కుక్కురముల
కన్న దలఁపఁగ నీ శున ♦ కంబె మిన్న.

ఇంద్రుః ధన్యుఁడవు ధన్యుఁడవు. సేవకునికై స్వర్గముగూడ విసర్జింపఁ బూనితివి. ఇట్టి ధర్మవర్తనముననే నీవాచంద్రార్కమగు యశము సంపాదించితివి. నీసుఖముకన్న సేవకుని సుఖమే యెక్కువగఁ జూచితివి. మంచిది. కుక్కతోఁగూడ స్వర్గమునకు రమ్ము. అక్కడ దుర్యోధనుఁడు మీతో శత్రుత్వమువదలి యుండును.

ధర్మ : స్వర్గములోపలనా ?

ఇంద్రుః అవును. స్వర్గములోపలనే.

ధర్మ : దుర్యోధనుఁడు స్వర్గములోపలనేనా ?

ఇంద్రుః అవును. రారాజు దుర్యోధనుఁడు స్వర్గములోపలనే.

ధర్మ : అట్లయిన నేను నరకమున కేగెద.

ఇంద్రుః ఏల ?

ధర్మ : దుర్యోధనుఁడుండు తావు మా కవమానకరము. శత్రువుతో స్వర్గమున నుండుట నరకములో నుండుటయే,

ఇంద్రుడు: స్వర్గమున శత్రుత్వ మిత్రత్వము లేమియు నుండవు.
ధర్మ : ఉండనీ యుండకపోనీ. నానల్వురు తమ్ములును నాభార్యయు నెటనుండిరో నన్నటకే గొనిపొమ్ము.
ఇంద్రుడు: అయినను నరకమునకుఁ బోవలయు; (పరిక్రమింతురు. తెర యెత్తగా నరకము గన్పించును. చేతితోఁ జూపుచు) ధర్మరాజా! చూచితివా?

సీ. నాథుఁడు ప్రక్క ను ♦ న్నను జారుఁగూడె నీ
కొంటెలంజను నగ్ని ♦ గెంటవలయు
కనఁబడు సతినెల్ల ♦ గవయఁజూచెను వీని
గ్రుడ్లలో గత్తులఁ ♦ గ్రుచ్చవలయు
కనులుగానక సోద ♦ రునిగూడె నీ మొండి
ముండ తలన్ బండ ♦ మోపవలయు
అనుజుఁ జంపించి త ♦ ద్వనితనుఁ గూడె నీ
చండాలు శిరమునుఁ ♦ జెండవలయు

గీ. ననుచుఁ జిత్రగుప్తుం డంత ♦ కుని సమక్ష
మునను చెవిసందిటన్ గలం ♦ బును నిమిడ్చి
యింతశిక్ష వీనికి మరి ♦ యింతశిక్ష
దీనికని కాగితంబులన్ ♦ వ్రిప్పుచుండె.

అవిగో! నగ్నికుండంబులు; అల్లదిగో: నచ్చో గంటకంబులును గత్తులును బరచియున్నవి. అదిగో! నచ్చటఁ జీము ప్రవహించుచున్నది. అగ్నిజ్వాల లెంత భయంకరములుగా నున్నవో చూడుము.

ధర్మ : అబ్బా! యీ దుర్వాసన భరింప శక్యముగానున్నది.
ఇంద్రుడు: మొదటి యడుగుననే భయపడితివా?
ధర్మ : నే నిట నుండఁజాల, దిరిగిపోవుదము. (పరిక్రమింతురు.)
భీము : నన్నీ యినుపకాకులనుండి కాపాడుము.
అర్జు : నన్నీ సర్పములనుండి వదలింపుము.
నకు : ఈ శెలతో నాగ్రుడ్లను గ్రుచ్చనీయకుము.

సహ : నన్నీ ముండ్లనుండి దింపుము.

ద్రౌప : కాలెడు నా శిరముపై నించుక కన్నీరు రాల్చుము.

ధర్మ : (విని) ఓ ఆర్తులారా ! మీ రెవ్వరు ? ఎక్కడనుంటిరి ?

(మరలఁ దెరలో)

మేము నీ తమ్ములము. ద్రౌపతితోఁగూడ నరకబాధ లనుభవించు చుంటిమి రక్షింపుము.

ధర్మ : (ఆశ్చర్యముతో) ఏమీ : నా సోదరులును ద్రౌపదియు నరక బాధ లనుభవించుచుండిరా ? పరమేశ్వరుఁడు న్యాయబద్ధుఁడని వేదములు చెప్పుచున్నవిగదా. ఇది యేమి న్యాయము ?

ఇంద్రు : అవును. గుణవంతులైనను వారి దోషములుపోవు. పరమాత్మ కేవలము న్యాయబద్ధుఁడు. పక్షపాతశూన్యుఁడు. నిష్కోపి. సర్వ సముఁడు ఆయనదృష్టి శుభాశుభములఁ బరీక్షించును. ఆయన సర్వజ్ఞుఁడు. ఈ నరకమునఁ బుణ్యపాపములు సరిగాఁ దూయ బడును.

ధర్మ : అయిన వీరేమి పాపము గావించిరి.

ఇంద్రు: ఇంచుకఁ గావించిరి. వాని వివరించెద వినుము.

సీ. అనిలోన దుర్యోధ ♦ నుని తొడ ల్విరుగఁగొ
ట్టెను క్షాత్రధర్మము ♦ న్గనక భీముఁ
డల శిఖండిని ముందు ♦ నిలిపి పితామహు
న్హరియించె శరముల నర్జునుండు
నకులుఁడు నేనుగా ♦ గఁ గడఁగి యింతికా
ర్యమును జేసితి నటం ♦ చు మదమందె
సహదేవుఁడు సమస్త ♦ జనులలో నేనెపో
యతిబుద్ధిమంతుఁడ నని మదించె

గీ. కామిని యటంచెఱింగియుఁ ♦ గాదు పూరు
షుండెయని పెండ్లిఁజేసె శి ♦ ఖండికి ద్రుప
దాత్మజాత కావున నిప్పు ♦ డట్టిఘోర
దురితఫల మ్మొందించుచున్నారు ♦ నరకమందు.

ధర్మ : పరమేశ్వరా ! వారి పాపంబుల క్షమింపుము.

ఇంద్రు: ఇక్కడికి నీవువచ్చిన కారణముగూడ వినుము.

ధర్మ : నేను స్వేచ్ఛాపూర్వకముగా వచ్చితిని.

ఇంద్రు: అట్లుగాదు. నీవుగూడ కర్మఫల మనుభవించుటకే.

ధర్మ : ఎట్లు ?

ఇంద్రు: ధైర్యముతో వినుము. పశ్చాత్తాపమొందుము. అశ్వత్థామాభిధానకమగు గజమును జంపి ధనురాచార్యులతో నశ్వత్థామ చచ్చెనని చెప్పితివి.

ధర్మ : (పశ్చాత్తాపముతో) మహేంద్రా! సత్యము సత్యము. నేనిప్పటికి నా నీచకృత్యమువలన లజ్జించుచున్నాఁడను. (క్షణముండి) కానీ, దుర్యోధనాదుల పాపంబునకుఁ బ్రతిఫలంబు గన్పింపదు.

ఇంద్రు: పాపమెక్కువజేసి పుణ్యము తక్కువ గావించినవారు మొదట కొంచెము సౌఖ్యమనుభవించినపిమ్మట శాశ్వతముగా దుఃఖమనుభవింతురు. పుణ్యమెక్కువజేసి పాపము తక్కువజేసినవారు స్వల్పమగు దుఃఖమనుభవించి పిమ్మట శాశ్వతసౌఖ్య మనుభవింతురు. దుర్యోధనాదు లింకముందు సౌఖ్యములేక మహా దుఃఖముల పాలగుదురు. ఇఁక ముందు భీమార్జున నకుల సహదేవులును బాంచాలియును మహాసౌఖ్యములం గాంతురు. ఇదిగో : నిప్పుడు చెప్పుచుంటి ; ఇది నిజముగా శునకముగాదు. ధర్మదేవత నిన్నుఁ బరీక్షింపవచ్చినది, ( శునకము అంతర్ధానమగును. ) ఇఁక నీ విందుండఁజనదు, స్వర్గమునకు రమ్ము పోవుదము.

( అందరు నిష్క్రమింతురు )

రంగము—స్వర్గము

[ తర్వాత ద్రౌపదియుఁ బంచపాండవులును ఇంద్రుఁడును బ్రవేశింతురు ]

ఇంద్రు: ధర్మరాజా : నీ యిష్టము నెఱవేఱెగదా ? దుర్యోధనాదు లిప్పు డతి కష్టము లనుభవించుచున్నారు. మీ ధర్మమే మీ కభ్యుదయ